

# చంద్రకాంతనాటకము.



చ. ధరఁగల జీవకోటులను దండనసేయఁగఁ జాలియున్, దశాం
తరమునఁ గల్గినట్టి యవతారమునన్ సతిపెంప, ఖ్యాతిచే
దురమున దుష్టసంతతుల దోర్మదమున్ హరియించి మించు శం
బరరిపుఁడై తనర్పు భగవంతుఁడు, ప్రోచుత మిమ్ము నెప్పుడున్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి పూవులను
సభ్యులపైఁ జల్లి]

సూత్ర — (తెరవంక నాలకించి) సంతోషము సంతోషము నే నీగాయకగానామృతవారిరాశితరంగంబుల నుయ్యాల లూగుచున్న వాఁడను మఱియు నీగానము —

గీ. సృదుల మార్దంగికరవము గదిసి యంత్ర
గాత్రరవములు కవగూడఁ గలుగుకతన
నెందుమ్రోడులు చిగురించుచుండ నాదు
చిత్తమును బల్లవించుట చిత్రమొకొ!

(కలయఁజూచి) ఆహా! శ్రవణములకే కాక నయనములకును నుత్సవంబు చేయుచున్నదే యీరంగస్థలము!

గీ. తెఱలపైఁ జిత్రితము లైనతీవగముల
నలరు రూపులఁ గని యాస నళులుమృదుల
గానములు సేయుచును మోద కలన మూఁగెఁ
జిత్రకారుని మహిమంబుఁ జెప్పఁదరమె?

(ఆకసమువంకఁ జెవియొగ్గి) ఏమనుచున్నారు? రంగప్రసాధన మోహవశుఁడవై యార్యకృతనిరాదరణుండవైతి వనియ? బాగు! బాగు! చక్కఁగా జ్ఞాపకముఁ జేసినారు. (సభనుచూచి) ఆహా! ఏమి? ప్రేక్షకుల దృగ్జాలంబులంగని ప్రసవాసవభ్రాంతిచే నవనికాభ్యర్ణమున సంచరించు నాందోళంబులని భ్రాంతిఁ జెందతిని. సకలశాస్త్రార్ణవప్రోత్తీర్ణకర్ణధారాయమాన పండితాఖండలశోభితంబును, నవరసవికీర్యమాణగ్రంథకల్పనాసమానసాహితీపరిశోభిత కవిచంద్ర సముదయ విరాజితంబును, సమస్త సర్వంసహా భారవహనధౌరేయరాజకులమకుటస్థగితేంద్రనీలకాంతిపూరప్రభావిలసితంబును, అగ్రకులసేవా తత్పరచతుర్థకుల పరిశోభితంబు నగునీసభ మదీయనేత్రోత్సవముఁ గావించుచు, నాపైఁ గరుణారసముఁ జిలికించుచున్నయది. అదిసజ్జనులగు నీసదస్యులకుచితమే, నేనిపుడుకదా! నీరలకుఁ గృతజ్ఞత నెఱపవలసినది? (ఆలకించి) అల్లదె మంజీరరవము వినవచ్చుచున్నది. ఆవచ్చునది నాప్రేయసియే (చూచి) అనేకరూపకాభినయశారదయగు నాకాంతకు వేఱ చెప్పవలయునా?

[అంతట నటి ప్రవేశించును.]

నటి—భరతపుత్ర! నమస్కారము.

సూత్ర - ప్రేయసీ! ఏమి? అటులు వాడు తేరిన తమ్మితూఁడువలెఁ జొక్కియున్నదానవు.

నటి—మఱేమియు లేదు. రత్నమాలికావేషము సహించి యుడుపుల నిసుములఁ బకునటు లభినయింపవలయుఁగదా! అని తద్రసార్పిత చిత్తనాటచే నటులగుపడుచున్నదాన.

సూత్ర.—కళ్యాణీ! మన మాడఁదలఁచినది చంద్రకాంతనాటకమని నీ కెటులు తెలిసినది?

నటి—ఆర్యా! మీచే నారంభింపఁబడిన నాందివలన.

సూత్ర - ఓసీ! నీవు పండితురాలవుసుమి!

నటి — అదియంతయు మీప్రభావమే.

సూత్ర — సరి దాని కేమిగాని మనప్రస్తావన నింతటిలో విరమింతము నీవను ఋతువర్ణన మొదలుపెట్టుము.

నటి. ఆర్యా! గ్రంథకర్త కొక యాశీస్సు నొసంగవలెనే!

సూత్ర. ఔను, మఱచితి నాయనకు తమ మున్నొకకవితల్లజుండొసంగిన యాశీర్వచనమే యున్నది వేఱొకండు వెతకనేల? వినుము

మ. సకలశ్రేయము లిచ్చుగాత తను శ్రీచంద్రావధానాన్వయా
బ్ధికిసోముం డగు నారసింహసుతుండై దీపించు మాణిక్యశ
ర్మకు శ్రీవేంకటసుబ్బరాయగురుశుంభత్పాదభక్త్యైకశీ
లికి మేలైన కవిత్వశైలికిని నాళీకాక్షుం డత్యాప్తుండై.

నటి — బాగుబాగు! అటులే శుభముసంధిల్లెడుం గాత! నేం జేయవలసిన ఋతువర్ణనంగూడం జేసెదను.

గీ. చంద్రకాంతులు సోకినం జంద్రకాంత
రత్నమాల కఱంగుకరణినిం జైత్రుం
గనిన వనకామినికి మేను కందళములు
వ్యాజమునం బులకిత మయ్యె వన్నెం దనరి.

సూత్ర — బాగుబాగు నీగానకళావైభవమున నట్లే యగుచున్నది. అల్లదె నేపథ్యమ్మునంగల సభాభవనమ్ము నధిష్ఠించుటకుం జంద్రచూడమహారాజవేషమున మనగాయకచంద్రుండు వెడలుచున్నాండు మనమును మనభావికార్యములకై త్వరపడవలయునుగదా! కావునం బోవుదముగమ్మా.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



శ్రీ

# చంద్రకాంతనాటకము.

## ప్రథమాంకము.

రంగము—సభామందిరము.

[చంద్రచూడమహారాజును మంత్రి బుద్ధిసాగరుఁడును ప్రవేశింతురు.]

చంద్ర—ఓమంత్రిశేఖర!

మ. మనరాష్ట్రంబున నెల్లవారు నిజధర్మంబుల్ విసర్జింపకుం
డను వర్తిల్లుచు నున్నవారలె నిరాటంకంబుగా సుంకముల్
చను ప్రస్తారఁగ నిచ్చుచుందు రొకో! యీర్ష్యల్లేక సత్సంగతిన్
మనుచున్నారలె భాగ్యభోగ్యముల సేమం బొప్పగా నుండురే.

బుద్ధి—

గీ. రాజచంద్రను! మీదయారసనమృద్ధ
చంద్రకాంతులు ప్రసరింప సౌఖ్య మరుదె?
ఓషధీశునికిరణవిశేషమునను
గాక ధరణివనస్పతుల్ కలిమి గనునె.

ఓరాజన్యచూడామణి!

గీ. లేదనెడులోభి యొకఁడైన లేడు భువిని
ధనికులయ్యును మత్తతగానరు నరులు
ప్రధనశూరులు నిజరాజభక్తిపరులు
దేశజనులు కదయ్య పృథ్వీశచంద్ర.

చంద్ర—ఓసచివాగ్రణి!

క. తన దేశకష్టసుఖములు
తన వనుకొని యెవఁడు లోనఁ దలఁచి మెలఁగు నా
మనుజుఁడె మనుజుఁడు నరపతి
యనఘుఁడు దేశస్వరూపుఁ డవు బరముఁ డగుర్.

బుద్ధి — దేవా! మనుజులును రాజులును సేవింపఁదగిన ధర్మము లవియే కదా!

గీ. అన్ని ధర్మముల నెఱిఁగి యఖిలకార్య
ముల నొనర్పఁగ దక్షులై మెలఁగు మీకు
మీ సమస్త రాజ్యమునకు వాసిగలుగు
టరుదె శ్రీచంద్రచూడమహామహీశ.

చంద్ర — ఎంతయుండిన నేమి?

చ. కలవు సమస్తసంపద లఖండపురందరవైభవంబునుం
గలదు ప్రతాపసైనికనికాయమునుం గల దెన్ని యుండినన్
గులము సముద్ధరించు పసిమానవు నొక్కని పుత్త్రుఁ గాంచి క
న్నులకును గర్వదీఱఁ గన నోచని చింత మదిన్ దహించెడున్.

బుద్ధి — దేవా! అది యట్టిదే. అందువలన నేకదా! బ్రహ్మ కేవల మూఢుఁడని నిందితుఁడై నవాఁడు.

గీ. బీదవారికి మితిలేనిబిడ్డ లుండ
లోకపతులకు సంతతిలేక యుండ
దంపతులు నొక రొకరికిఁ దగక యుండ
బ్రహ్మఁ మూఢుఁ డనుచు నిందఁ బడఁడె జగతి.

చంద్ర — మంత్రిశేఖర! నిక్కము వచించితివి. అయినను నందనులు లేని యీ రాజ్యమేల యీ శరీరమేల?

బుద్ధి — మహారాజ! అది నిశ్చయమే అయినను

చ. కడుపఁగ లేదు పుత్త్రకులఁ గాంచెడికాలము, ధర్మరాజ్యమం
దొడయుని రాకుమారకుని నొక్కనినైన ననుగ్రహింపఁడే
జడమతిబ్రహ్మ మానసిక సత్తపముల్ బొనరించుమీకు ని
వ్వడువునఁ జింతఁ బొందఁ దగవా మునివర్య లోసంగకుందురే?

సేవకుఁడు—మహారాజ! ద్వారమునొద్ద నెవ్వరో మునీసరర్య్య
గారు మీయానతికై కాచియున్నవారు.

చంద్ర—ఓరీ! తత్క్షణమప్రవేశ పెట్టుము.

సేవ—చిత్తము (తెరలోకిచూచి) ప్రభువువారి యనుజ్ఞయయి
నది అయ్యా! దయసేయుఁడు.

[అంతటదూర్వాసమహర్షి ప్రవేశించును.]

దుర్వా—జయశంకరీ! జయగౌరీనాథ!

చంద్ర—మహాత్మ! అభివాదన మొనర్చుచున్నవాఁడను.

బుద్ధి—స్వామి! నమస్కారము.

దుర్వా—ఓరాజచంద్రమ! కళ్యాణపరంపరావాప్తిరస్తు. మంత్రీ!
నీకు శుభమగుఁగాత.

చంద్ర—

చ. అలఘుతపోధానమహిమాతిశయోన్నతసత్ప్రభావ! రా
జులమగుమమ్ముఁ బ్రోచుటకుఁ జూడఁగవచ్చితె! లేకయున్న వ్యా
కులమగురాజ్యతాపమునఁ గుల్లుమ లేవఁగలేకయున్న నం
ధుల కిఁక నెట్టు కల్గును గతుల్ వచియింపవె భూసురాగ్రణీ!

దూర్వా—ఓచంద్రచూడమహారాజ!

శా. సేతూద్బంధనపుణ్యభూమి గని యాశ్రీరామలింగేశ్వరున్
బ్రీతిఁ బూజలు సేసి యంతట మహావీరస్థలం బౌ పునా
ప్రాంతంబుం గని భూప్రదక్షిణముగా రా నే నిటన్ నీమప్ర
ఖ్యాతిన్ వీనుల గాంచి వచ్చితిని నిన్గాంచంగ నోభూవరా!

చంద్ర— మహాత్మా! అది నాపూర్వకృతపుణ్యఫలం బని యెంచు చున్నవాఁడ. ఓరీసేవక! మహర్షి నర్చించుటకు దేవి నర్ఘ్యమునుగొనిరమ్మని చెప్పుము.

సేవ— (తెరలోనికి చూచి) అర్ఘ్యనోపకరణములతోనే యామె వచ్చుచున్నవారు ఇఁక నేఁ జెప్పనేల?

దుర్వా— (తనలో) ఈదేవి అధికవివేకసంపన్న యని తలఁచెదను.

[అంతట దేవి ప్రవేశించును]

దేవి—(అర్ఘ్య మటనుంచి మునికి) మహాత్మా! నమస్కారము. (రాజునకు) ప్రాణేశ్వర! నమస్కారము.

దుర్వా— అమ్మా! నీకు శుభము కలుగుఁగాత.

చంద్ర— దేవి! అర్ఘ్య మిటుపోయుము (దేవి యటుచేయ ముని పదములఁ జల్లి శిరములఁ జల్లుకొని)

చ: కులము పవిత్ర మయ్యె మునికుంజర మామక దేహజన్మలున్
గలుషత వాసిపూతములుగా రహించెను మాగృహమ్మునన్
దులసిదళోదకంబు దయతోఁ గొని గేహముఁ బావనమ్ముగా
సలుపగదయ్య ధర్మగుణసాంద్ర! దయాకర! పాపభంజనా!

దుర్వా — ఓరాజ!

గీ భక్తిపరుఁడవు సద్ధర్మపరుఁడ వీవు
సంతసించితి నీదు నర్చనల కెల్ల
నఖలధర్మాధికారి వీ వగుటఁ జేసి
భోజనము సేయ సమ్మతిఁ బూనినాఁడ.

చంద్ర — మహాత్మ! కృతార్థుఁడను. దేవి! సర్వముసిద్ధపరపుము.

దేవి—మహాప్రసాదము స్వామి (లోనికిఁ బోయి అన్నిటిని తెచ్చును.)

దుర్వా—(నలుకెలంకులంగని యోచన నభినయించి) ఏమి! రాజా నీ వనపత్యునివలెం గన్పట్టుచున్నాండవే (కోపముతోం జూచును.)

చంద్ర—మహాత్మా! అదియేకదా! నామనశ్శల్యము! దయాదృష్టితో నపరశివావతారులు దీని నిర్మూలించి నమ్మేలవలయును.

దుర్వా—(కోపముతో) ఓరీ రాజకులకళంక! మాయకాడ! చంద్రచూడ! నిన్నిప్పు డేమి చేసెదనో చూతుము (లేవంబోవును.)

చంద్ర—మహాత్మ! రక్షింపుండు.

అందరు—(భయము నభినయింతురు.)

దుర్వా—ఏమి! నిన్ను రక్షింపవలెనుగా!

ఉ. బిడ్డలు లేనియింట నెటు విందులు సేయంగ నర్హ మానురా!
చెడ్డ యటంచు నెంచక విశేష మనీయతపఃఫలంబుం బెక్
గడ్డలపాలు సేయుటకుం గా సమకట్టితె దుర్మదాంధ! నీ
మడ్డితనంపు వృత్తమును మాన నిదే శపియింతుం జూడుమా.

అందరు—(భయకంపములతో నివ్వెఱంగంది చూతురు.)

బుద్ధి—మహాత్మ! మృగరాజము విజృంభించిన మృగములకు రక్షక మెందుం గల్గు? దయారసముం జిలికి ధర్మాధికారిని రక్షింపుండు.

చంద్ర—(తనలో) రెండవ వీరభద్రావతారమువలె నీమూర్తి చూడ దుస్సహమైయున్నది (ప్రకాశముగ) దేవా! దీనదయాపర! ఎఱుంగక చేసిన నాతప్పు సైరింపుము.

చ. అలుక వహింప లోకము సమస్తము భగ్గున మండిపోవు మీ
రలుగక ప్రేమతోం గనిన హాయిగ నీభువనంబు చల్లఁగా
వెలయును సౌఖ్యసంపదల వేడుచు నుంటిం గదయ్య మీరె యీ
కలన శపింప నెవ్వరిక గాతురు మమ్ముల మీదుభృత్యులక్.

దుర్వా—ఛీ! రాజా! నీవా! ఎఱుంగవు!

గీ. గొడ్డురాలిచేఁ గూడదు నింద్య మటంచు
విధవచేతియన్న మధమ మంచుఁ
బెద్దలు వచియించు వేదవాక్యము లెల్ల
నెఱుఁగకుండఁ జేసితే! దురాత్మ!

ఇఁక నిన్ను నే విడువను.

సేవకు—(తనలో) ఇంతమాత్రమునకే యీయన యిన్ని గంతులు వైచుచున్నవాఁడు. తనయాలి విధవయైనపుడు కాని తన కీధర్మములు తెలియవు. తింటాడో లేక పంపుకొంటాడో !

దేవి—(తనలో) దుర్వాసుఁడు కోపిష్ఠి యని చెప్పినందులకును నేడు ప్రత్యక్షముగఁ జూచి యనుభవించుచున్నందులకును సరిపోయినది. (ప్రకాశముగ) ఓఋషిచంద్రమ!

ఉ. సంతు జనింపలే దనువిచారమె మాయెదఁ గాల్చుచుండఁ బెన్
వంతఁ జరించుచుందుము జనంబులలోఁ దలయెత్తలేక, యా
చింత యటుండ మౌనికులశేఖర! యజ్ఞత మాయెనర్చు నా
వంత ప్రమాదపాతమున కంతచలంబు వహింపఁ జెల్లునే?

దుర్వా—ఓరాజపత్నీ! ఇది యావంతదోషమా? ఎఱింగియు నీ నింద్యాన్నము వెట్టి నాతపము భగ్నము సేయఁదలంచిన మీరందఱు మదీయదుర్వారకోపదావానలంబునకు శలభంబు లగుచున్నారు.

ఉ. భాసురసంతతాఖిలతపఃఫలయుక్తుఁడు సంతతాగమా
భ్యాసుఁడు నిర్జితేంద్రియవిభాసుఁడు బ్రహ్మసమానసత్త్వవి
న్యాసుఁడు లోకకర్తయును హంతయు రక్షణశాలియైన దు
ర్వాసునికోపకీలలలవంబు నెఱుంగరో దుష్టభూపతుల్.

చంద్ర—మహాత్మ! రక్షింపుము. మిమ్మెఱుంగనివా రుందురా? (పాదములఁబడును)

దేవి — తండ్రీ! దుర్వాసమహర్షి! మమ్ము రక్షింతుమని వరం బొసంగువఱకు మీపాదములను విడువము.

(పదములపైఁ బడును.)

గీ అగ్నిఁ బడి చచ్చుటకు సిద్ధ మగుదుఁగాని
గొడ్డురాలను నిందలకును సహింప
పుత్రభిక్ష మొసంగి నన్బ్రోవుమయ్య
కూఁతు గొడ్డాలయిన జనకుఁడు సయిచునె?

బుద్ధి — ఈమహారాజ రక్షణఫలము దేశరక్షణ ఫలసావృశ్యమై మిమ్ము్నల వరించుఁగాక.

దుర్వా — (ఆలోచించి) తొలుత విందుసేయుట కంగీకరించి మానుటచే నసత్యదోషము సంప్రాప్త మగును. చేసిన నపత్యాన్నభక్షణ దోషము సంప్రాప్త మగును. ఏమి సేయుటకును దోఁచకున్నది. వీరి నను గ్రహించుటయు దేశోపకారము.

చంద్ర — మహాత్మ!

గీ. తమ రనుగ్రహంబు దలఁచిన సంతతి
గలుగు టరుదె నాకు గడియలోన?
వర మొసంగి పుత్రవంతుని జేయవె
వందనములు మానివర్య మీకు.

బుద్ధి — దేవ! భూతదయాకర! అనుగ్రహించి రాజవంశ ముద్ధ రింపుము.

దుర్వా — ఓమహారాజ! ఓపుత్రికామణీ! మీ రనుగ్రహింపఁ బడినారు లెండు లెండు.

చంద్ర & దేవి — ఆర్యమిత్ర! ధన్యుల మైతిమి.

దుర్వా — ఓరాజన్యచూడామణి! నీయుత్తర జీవయాత్రను మేము దివ్యదృష్టితోఁ దిలకించినారము. నీ కొకపుత్రుఁడు పుట్టఁగలఁడు. అందు

నై భక్తపరాధీనుండైన శంకరుంగూర్చి తపంబుసేయుము నీయభీష్టము నెరవేరును. అమ్మా! పుత్రవతి వగుదువుగాత.

చంద్ర—మహాప్రసాదము.

దేవి—మహాత్మ! ధన్యురాల నైతిని.

దుర్వా—నా కిఁక యన్నృతదోషము రాకుండఁ గేవల తులసి దళోదకముమాత్రము స్వీకరించెద నిమ్ము.

చంద్ర—చిత్తము (అటులు కొంచె ముదకము చేతియందు వేయును.)

దుర్వా—(స్వీకరించి) నే నిఁకఁ బోయివచ్చెద నీవును దపంబున కేగుము.

(నిష్క్రమింతురు.)

చంద్ర—మంత్రిశేఖర! ఈమహర్షికోపమే మనకు మేలైనది. నే తపం బాచరించుటకుఁ బోయెదను. నీవు రాజ్యభారము వహించి ధర్మము నెరపుచుండుము.

బుద్ధి—చిత్తము.

(అందరు నిష్క్రమింతురు.)



శ్రీ

# చంద్రకాంతనాటకము.

## ద్వితీయాంకము.

రంగము—కైలాసప్రాంతము.

చంద్రచూడ—(తపము చేయుట యభినయించి)

గీ. ఎవఁడు కను విప్ప జగముల కెసఁగు సుఖము,
లెవఁడు కనుమూయ భువనమ్ము లెల్లఁ బొలియు,
నట్టి పక్షిశతరుఁడు పరమాత్మ శివుఁడు
నగుపరబ్రహ్మ నాకుఁ బ్రత్యక్ష మగుత.

[కైలాసము ప్రమథగణభూతకోటిమునిజనములతోఁ బార్వతియు శివుఁడును భృంగియు ప్రత్యక్ష మగుదురు]

చంద్ర—దేవ! ఉమారమణ! మాంపాలయ మాంపాలయ.

శివుఁడు—వత్సా! చంద్రచూడ. నీయభీష్ట మెఱింగింపుము. నీ భక్తికి మెచ్చితిని.

చంద్ర—దీనశరణ్యా, నాగనరదేవజగద్భరణాభిగణ్యా!

ఉ. మానుల. బ్రోచువాఁడ విబుధేశ జగద్భరణాభిమాన యో
మానిత వేదమాన్య యసమానమహామహిమాభిరామ నా
న్యావనతమాన్పియొక్క సుగుణుఁడగు కుమారుం దయసేయుమయ్య భూ
జాని నటంచు నన్ను విరసంబుగఁ జూడక పార్వతీశ్వరా!

శంక—వత్సా! నీయభీష్టము నెఱవేరునటుల యొకపుత్రుఁ డుదయించును గాని యాబాలునకుఁ బదునెనిమిదివత్సరములకంటె నాయు వధికముగా నుండదు.

చంద్ర—దేవా! ఆయువులేని సుతుఁడేల? మహాత్మా యనుగ్రహించి పూర్ణాయుష్కునిగాఁ జేయవేఁడెదను.

పార్వ—ప్రాణేశ్వర! ఇట్టి యసంపూర్తిగం బొసంగుటకుఁ గారణ మొండు కలదని నేఁ దలంచెదను.

శివు—కారణ మున్నది. కళ్యాణీ! ఈచంద్రచూడుని పూర్వ జన్మసుకృతమ్మునఁజేసి నే నీతనికిఁ బుత్రుండనై పుట్టవలసి యున్నది. ఆకారణంబున నేనీసమయమునఁ బుత్రుఁడనై పుట్టి వేఱగు భూభారహరణ కార్యములేని కతనను నిన్ను విడచియుండలేక జన్మించి వెంటనే నిర్యాణము నొందఁదలఁచి యిటు పల్కితిని.

పార్వ—ప్రాణేశ్వర! వరప్రదానంబునం జేసి మదీయభక్తాగ్రేసరుండైన సింహకేతుని పుత్రికనై నే నిదివఱకె పన్నెండువత్సరంబుల క్రిందటజన్మించి రత్నమాలికా నామధేయంబున భూలోకంబున నున్నదానఁ గదా! కావున మీరును నవతరింపుఁడు. మన మిరువురముఁ గొంతకాల మీభూతలంబున విహరింతము.

శివు—(ఆలోచన నభినయించును)

పార్వ—ఈవిషయమున మీ రాలోచింపవలదు.

శివు—అటులే చేసెదను. ఓచంద్రచూడమహారాజ! ఆజన్మించిన బాలునికి పన్నెండు రోజులలోగా పన్నెండు వత్సరముల ప్రాయము గల బాలికను బెండ్లిజేసినచో నతండు పూర్ణాయుష్కుఁడే యగును కావున నటు సేయుము

చంద్ర—మహేశ! అది నావంటియసమర్థునకు దుర్ఘటకార్యము కదా! దేవ! అనుగ్రహించి యటుల జరుగునట్లు తామే యనుగ్రహింపవలెను. మహాత్మా! రక్షింపుఁడు.

భృంగి—వామదేవా! కొండనాలుకకు మందు పుచ్చుకొనఁగా నున్న నాలుక యూడిపోయినదట సంతానము లేదని మున్నొకచింతయే కాని యట్టి దుర్ఘటకార్య మెటుసేతునో యని యిపుడు రెండవవిచారము కూడఁ దగులుచున్నది. ఇందువలన నీరాజునకే ప్రాణముమీఁదికి వచ్చును క్రియకు నాతొల్లింటియవస్థ యితని కిపుడు కలిగినది.

శివు — ఓయి నీవధిక ప్రసంగము సేయకుము.

భృంగి — లేదు స్వామి! ఆకాథ నాకు జెలియునుగనుక చెప్పితిని మున్నొకనాఁ డొకమామిడిపండును దినుచుండఁ బ్రమాదవశమున నా టెంకకుత్తుకలోఁ జిక్కుకొని పైకిరాక లోనికి పోకయుండె. అపుడు శ్వాస యాడక ప్రాణముపోవుటకు సిద్ధమైనది. పాపము పుణ్యాత్ముఁడు, మనచండీశ్వరుఁడుఁ గ్రహించి సత్తువకొలఁది మెడమీదనొకగ్రుద్దు సాగఁదీసి కొట్టెనంత పిరంగిగుండువలె నాటెంకయూడి భూలోకములోనికి వచ్చిపడినది. అదియేకదా! భూలోకరసాలములు గల్గుటకుఁ గారణమయ్యె.

పార్వ — ఓయి బ్రహ్మచారి! నీవాగ్ధోరణికిఁ దెరపులేక యున్నది. ఇఁకఁ జాలింపుము.

భృంగి — అమ్మా! బ్రహ్మచారినగుటంజేసి యేనుసుఖముగ బ్రతుకుచున్నాఁడను పెండ్లియే చేసికొనినచో, నిల్లాలిమాటలాలకించుచు నామెయాజ్ఞల కడుగుదాఁటక యామె నియోగించు కార్యములు చేయలేక నే నీవరకె చిక్కి నగమైయుందును.

శివు - ఓసీ! వాచాట నీప్రగల్భము లిఁక మానుము. ఓరాజా నీ వెట్టులైన నాబాలునికిఁ బన్నెండువత్సరములబాలికను సమకూర్పుము దైవప్రేరణమున నీకది తప్పక లభించును పొమ్ము.

చంద్ర — మహాదేవ! లోకమాత! నిరంతరము మీభక్తుని బోషించుభారము మీయదియె మీ కందఱకు నమస్కారశతంబు లర్పించుచున్నవాఁడ.

దేవతలు — (నిష్క్రమింతురు.)

చంద్ర — ఇప్పటికిఁ గృతార్థుఁడ నైతిని. అనంతరకరణీయమునకై నామనం బాందోళనం బొందుచున్నది. అన్నిటికిని మహాదేవుఁడే నాకుం దోడ్పడఁగలఁ డని యొకధైర్యమును గల్గెడి నిఁక నీశుభవార్త మామంత్రియగు బుద్ధిసాగరున కెఱింగించి పురమునకుఁ బోయెదను. (నిష్క్రమించును)

శ్రీ

# చంద్రకాంతనాటకము

## తృతీయాంకము.

రంగము—శోణపురిప్రాంతభూమి.

[బుద్ధిసాగరుఁడు ప్రవేశించును]

బుద్ధి—గీ. మదిని సంకల్పదారిద్ర్య మొదవకుండ
డెందమునఁ బిరికితనముఁ జెందకుండ
కార్య మొనరించు నెడ శ్రద్ధ కలిగెనేని
మనుజున కసాధ్యకార్యమ్ము మహినిగలదే.

కావున నీశ్వరవరప్రదానమునం జేసి మా చంద్రచూడమహారాజునకు జన్మించిన బాలకునకు నీపదిరెండు పురిటిదినములలోనే పన్నెండేండ్ల వయసుగల కన్నియను బెండ్లిచేయవలయు నను దుర్భరకార్యభారము వహించినాఁడను. ఇంతవరకట్టి బాలిక చేకూరలేదు నా కుమారుఁడైన చంద్రసేనుని చిత్రపటమును జూపి చంద్రచూడపుత్రుఁడైన చంద్రకాంతుండితఁడని బొంకవలయును. ఈయంశ మెవరైన నెఱింగిన నాతలదీయుదురు. ఇంతకు నీకార్యము తప్పక సఫలమగునని శంకయుండువరం బొసంగెఁగదా! మంచియో చెడ్డయో! నూఱు కల్లలాడి యొక యిల్లు నిలుపుమని పెద్దలు చెప్పుదురు. నేనెన్నితిప్పలు పడియైన నవశ్యము రాజరక్షణ మాచరించి తీరెదను. అల్లదె శోణపురము సమీపించితి నీపురనాథుఁడైన సింహకేతుఁడు రాకుమారుఁడైనను దైవభక్తియు శాంతస్వభావమును గలవాఁడు. ఇచటఁగూడ నన్వేషించెదను

(నిష్క్రమించును.)

రెండవ రంగము — సభామందిరము.

[సింహకేతుఁడు, మంత్రియుఁ బ్రవేశింతురు.]

సింహ—అమాత్యశేఖర !

ఉ. సంతతి కల్గునంతకు విచారము మెండుగ బాధసేయు, నా
సంతతి కల్గ వారలకు సౌఖ్యముఁ గూర్చుటకై మనంబునన్
జింతిలఁ గల్గు నిక్కముగఁ జిత్తమునన్ దలపోసి చూచినన్
వంతయెకాని సౌఖ్యము రవంతయు లేదు గృహస్థపాళికిన్.

అందుఁ బుత్రిక లౌదవినచో నిఁకఁ జెప్పనేల? అన్నియు విచారకారణము లెయగు.

మంత్రి—దేవా ! మీ రానతిచ్చినది సత్యమే యయినను

ఉ. సంతతి లేని గేహము, రసంబు స్రవింపనిపుష్పగుచ్ఛమున్,
శాంతవిహీనమౌ తప, మసత్యము కల్గిన పూరుషుండు, సా
మంతము లేనిభూపతియు, మంజులసంపద లేనికైతయున్
గొంతుక లేనిపాటయును గుంభినికిన్ భర మాటకే సుఁడీ.

కావున సద్గతుల కాధారభూతమైన సంతతివిషయమై నిగర్హణముగాఁ బలుకఁ దగదు.

సింహ—ఔ నది నిశ్చయమేకాని నాకుమారీమణి సద్గుణసౌందర్యాదివిశేషములంబట్టి భువనేశ్వరియైన రాజరాజేశ్వరియే నాగర్భమునఁ బుట్టెనని తలఁచుచుంటిని అటు లూహించుటకును గొన్నికారణములు కలవు గావున నట్టిమద్వంశాంకురమునకుఁ దగిన యవలంబనము దొరకునో లేదోయని యూహించుచుంటిని.

మంత్రి—రాజేంద్ర ! తమరు సెలవిచ్చినట్లు మీపుత్రికి కేవలము పరమేశ్వరీ యవతారమని యూహించుటకు సందియము లేదు. అయినను సృష్టించిన స్రష్ట వజ్రపుఁ బతకమును హైమసూత్రమునఁ గ్రుచ్చకయయోమయసూత్రమునఁ గ్రుచ్చునా!

[తెరలో జయము జయము మహారాజ.]

అల్లజయశబ్దము వనచారులరాకఁ దెలుపుచున్నది.

చారుఁడు—(ప్రవేశించి) దేవా ! జయము జయము. ఈరాకుమారుల పటములఁ జిత్తగింపుఁడు (మంత్రిచేతికిఁ బటముఁ నిచ్చును.)

మంత్రి—దేవా! ఈకుంతలదేశ రాకుమారునిఁ జూడుఁడు.

సింహ—మంత్రీ! ఈతనిరూపము రమణీయముగా నున్నను వామకర్ణమునైకల్యము గలదు.

మంత్రి – రాజా! ఈకళింగదేశాధీశుని చిత్రరూపమును జూడుఁడు

సింహ—(సంతోషముతోఁ జూచి)

గీ. ఆకృతిని బంచశరుని దృణీకరించు
నంగసౌందర్య మొంచఁగ నలవి కాదు
కాని, బాహులు దీర్ఘముల్ గామిఁజూడ
నంద మిసుమంత కోల్పతను జెందెనుమ్ము.

మంత్రి—దేవర చక్కఁగాఁ గనిపెట్టితిరి. ఈవంగదేశపు భూపకుమారునిఁ జూడుఁడు.

సింహ—మంత్రివర్య! చూడుము.

ఉ. ఆయువరాజురూపము లతాంతశరున్ భ్రమ మొందఁ జేయ భ
ద్రాయితమూర్తి నేత్రములు తమ్ములఁ బోలి విశాలసంపదల్
వేయి వచింప నేల పృథివీపతి పుత్త్రులలోన నీతఁడే
రాయఁడు గాఁగఁ దోఁచె, మకరధ్వజచైత్రజయంతు లెన్నఁగన్.

ఈతనినామ మేదియో !

మంత్రి—ఇతనినామము శ్యామసుందరదత్తు, మీపుత్త్రిక తఁకీ దనురూపవరుండని తోఁచుచున్నది.

సింహ—నీయూహాసరియైనదే కాని ఈతనిశరీరదార్ఢ్యము వంగదేశీయుల జవసత్త్వసంపదలకుఁ గళంకము దెచ్చుచున్నది.

మంత్రి—అది సత్యమే. బలహీనునివలె కన్పట్టుచున్నవాఁడు కాని ఇతని మించిన అందకాఁడు కానరాఁడు.

శ్రీ

# చంద్రకాంతనాటకము.

## చతుర్థాంకము.

రంగము — శోణపురవీధి.

[బ్రాహ్మణుఁడు ప్రవేశించును.]

బ్రాహ్మణుఁడు — ఇదివరకు నేననేకవివాహములను జూచితిని, చేయించితిని కాని యిట్టిపరిణయ మెచటను జూచియుండలేదు. సంపూర్ణ వైభవములతో వివాహము నిండువేడుకతో జరిగినది. దేవదుందుభులు మ్రోగునట్లు లందఱు సంతోషించినారు. కాని అదియేమిప్రారబ్ధమో పెండ్లికొడుకగు చంద్రకాంతుని మొగముమాత్రము కేవలవైరాగ్యమునుమాత్రము సూచించుచు నిరుత్సాహమై యున్నట్లు లగపడినది. అంపుల కనుగుణ్యముగా రత్నమాల వేయవలసినపుష్పహారము చంద్రకాంతుని కంఠమునందు వేయింపక ఏదోయొక పెట్టెపైని వేయించినారు. అదేమనిన నందు మాయిష్టదైవము కలఁడనియు నది మాకులాచారక్రమమనియు నందఱొక్కమొగి వాక్రుచ్చిరి, పోనిండు, పెట్టెఁ దెఱచి యందలిదైవమున కర్పింపు మనుట ధర్మము కాని పెట్టెపైని వేయుట అనుమానాస్పదముగా నున్నది దైవానుగ్రహమునఁ బునస్సంధానశుభముహూర్తము గూడ సమీపించినది. ఇప్పు డేమిచేసెదరో చూతము. తప్పక వరున కంగీకారము లేనివివాహమో కపట వివాహమోయై యుండవలెను, ఒకవేళ కపటమె నిజమైన సింహకేతునికిఁ జెప్పెదనని చంద్రచూడునిబెదరించి మధ్య పదిసంచుల రూకలైన

సేకరించుకొనెదను. ఊరకుండినచో నన్నెవఁడు చూచును? రంధ్రాన్వేషణ పరుఁడనని నాకు కితాబు రానేవచ్చినది. వచ్చినవాఁడు చచ్చినను బోఁడు నీని యుదంత మారసితీరెదను. (నిష్క్రమించును)

శుద్ధవిష్కంభము



రంగము — కేళికాగృహము.

[రత్నమాలికా మురళికలు ప్రవేశించెదరు.]

ముర — అమ్మా! రత్నహారము త్రొల్లింటికంటె నధికశోభ నహించినది సుఁడీ.

రత్న — మురళికా! ఎందువలన?

ముర — చంద్రకాంతమాణిక్యసంస్పర్శనమున.

రత్న — ఓసీ! నీవు ద్వ్యర్థివాక్యములకుఁ బుట్టినిల్లువుసుమీ!

ముర — అన్యాసర్వకళా విశారదల చెట్టఁబట్టినవారికిఁ ద్వ్యర్థివాక్యములకుఁ గొఱఁతయుండునా!

రత్న — ఓసీ! నీపలుకు లోకపరివిన్నవారి కెన్నఁడును నీవు మఱపురావుసుమీ!

ముర — ఇతరుల కేమికాని మీకు మాత్రము మఱపురాక మానను.

రత్న — ఏమి నేనేనా మఱచుదానను?

ముర — అదియే ఆకాశకుసుమము.

రత్న — నన్నేల వృధానింద చేసెదవు. నేనట్టిదాననా?

ముర — అమ్మా! చంద్రకాంతులకు నెలరాళ్లు కఱఁగి స్వస్వభావమును దొలంగుట సుప్రసిద్ధమేకద? అందుచే నేనట్లంటిని.

రత్న — నెచ్చెలీ నీవట్లు తలంపవలదు నిన్ను నేమఱచుట నన్ను నేమఱచుటయే?

మురళి—అమ్మా! నా కదియు సంతోషమే! ఏలయన సకల సద్గుణగరిష్ఠుండగు చంద్రకాంతునితో సంతత సౌఖ్యావహవై ప్రపంచము మఱచియుండుటచేత.

[అంతటఁ గపటచంద్రకాంతుఁడు ప్రవేశించును.]

చంద్రకా—(తనలో) ఆహా! నేటిదినంబున బహుకష్టతర మైన యొకకార్యమును నిర్వహించుటకు మాతండ్రి యగుబుద్ధిసాగరునిచే నియమింపఁబడితిని గదా! వివాహసమయంబున నెట్లెటులో బొంకి పుష్పమాలికను రాకుమారుఁ డున్నకరండమునకు వేయించితిని. ఇపు డీరత్నమాలిక నారాకకై వేచియున్నది. నే నీనవమోహనాంగిని సమీపించి చిత్తము చలింపకుండ వచ్చుట మృత్యుదేవతనోటఁ బడి మరలి వచ్చుటయే అది గాక నేనే తనభర్తనని నమ్మియున్నది. నే నీమెసౌందర్యమునకును వచనరచనలకును లోనై రాజద్రోహము సేయకుండ నీమెకు వైరాగ్య ముపదేశించి నేను బయలుపడవలెను.

కం. జనశూన్య మైనతలమున
తను వలచియు నెదురుచూచుతరుణి పయిఁ బడన్
ఘనుఁ డెవఁడో త్రోలగుఁ, దక్కటి
మనుజులు హృదయములు కఱఁగ మాయలఁ బడరే?

కావున భర్తృసంగమాభిలాషి యైన యీమదవతీమణిముఖంబునం బడి నే నెట్లు రాజగౌరవమును కాపాడఁ గలనో? ముందు నాహృదయము చంచలతఁ బొందకుండఁ బ్రార్థించెదను.

గీ. చంచలత్వముచేతను మించుచుండు
చిత్తమా! ధైర్య మించుక చెందవలయు
రత్నమాలికాదృగ్బాణరాశి కీవు
పాలుకాకుండ నచలసంపదలఁ గనుము.

ఎట్టులైన నానేర్పుచేత రాజభక్తిఁ జూపి కృతజ్ఞుఁడ నగుట కిదియే మంచి సమయము; సమీపించెదను (అటుల సమీపించును.)

ఇద్దరు—(చూచి లేచుచున్నారు.)

రత్న—(జనాంతికముగా) ఓసీ! మురళికా! ఊఱకున్న దాన వేల! నాకు మారు నాప్రాణేశు నర్పింపవే!

ముర—అమ్మా! ప్రస్తుత మాపని నీయదే!

రత్న—ఓసీ! అది యేమో కాని నాతనులత వడఁకుచున్నదే.

ముర—ఔనమ్మా మరుగాలి సోకినతనులతలు పున్నాగాశ్రయము లగుపటికిఁ జలించుట నైజమే! ఇందుఁ గ్రొత్త యేమి కలదు?

రత్న—ఓసీ! నీగడుసుపోకడ లిక్కడనా? ఇకఁ జాలించి కొంచె మీవిషయమునఁ దోడుపడదఁ గదటె.

[తెరలో]

ఓసీ! మురళికా! నామాట మఱచియే పోతివి కదా!

మురళి—(తెఱవైపుఁ జూచి) అవ్వల విద్యుల్లత యేదియో పలుకుచున్నది. దానికి సమాధానము చెప్పి వచ్చెదను. (పోఁబోవును)

రత్న—ఓసీ! నేనుగూడ వచ్చెదను (మురళికపైటకొంగు పట్టుకొని ఆపును.)

ముర—ఏమీ! నీవును వచ్చెద వేమి! అట్లైన నావెంటఁబడి రాక నన్నుఁగూడ నాపెద వేల? సిగ్గు ముందునకు నాశ వెనుకకును లాగుచుండుట నాకుఁ దెలియకపోలేదు. చాలుచాలు. నీపతి నర్పించుకొనుము. నిలువుము. ఇక్కడ నేనేల? (చంద్రకాంతుని) ఓరాకుమార! చంద్రకాంత! నీప్రాణేశ్వరి కచాదిభారములచే నిదివఱకే నిలువలేకయున్నది. నీవిపు డామె కధికానందభారమును పైఁ బెట్టినావు, ఆభారముల నామె యూరుయుగళము సహింపలేకున్నది. కావున నీ వాభారములఁ గొంత సేపు మోసికొని మాచెలియ లలసటఁ దీర్పుము. (నిష్క్రమించును.)

రత్న—(కొంచె మాలోచించి తనలో) ఆహా! నే నెంతధన్యు రాలను! మనీయవాంఛానికుంజంబు నేడె మొగ్గఁదొడిగినది. నే నిపుడు ముగ్ధత్వమ్మున నూరకున్నచో నిరాకరించితి నని యెంచుకొను నేమో? (ప్రకాశముగా) ఓరత్నపీఠమ! అనర్ఘరత్నస్థాపిత వయ్యును అధిష్ఠాత్రావలంబనములేని సౌందర్యము వ్యర్థమని యెంచి జన్మసార్థకమునకై తప మొనరించుచుసీకోరిక సఫలీకృత మానట్లు నీకలంకారమును గొల్పు మహనీయులు విచ్చేసియున్నారు. ఇఁక నీచింత తొలఁగినదిలే.

చంద్ర—(తనలో) ఆహా! ఈవాక్చాతుర్యమునకు మితిలేక యున్నది. నాకు నోరాఁడకున్నది. నే నీమాటకు నిరుత్తరుఁడను కావలసినదే! (తలయూచి యూరకొనును)

రత్న—(తనలో) అయ్యో! ఈయనమాటలాడుట లేదు నే నపదేశముగాఁ జెప్పితినని ప్రాణేశ్వరునకుఁ గోపము వచ్చినది కాఁబోలును. (ప్రకాశముగా) నాథా! మీ యనుపమానసుందరవిగ్రహసమావేశమునకై ఈరత్నపీఠికయే కాదు, నేనును దప మొనరించుచున్నదానము. దీపీఠిక నలంకరింపుఁడు

చంద్ర—సాధ్వీమణి! ఈరత్నపీఠిక నలంకరింపఁ దగినదాని చేతనే యలంకరించెదను (పెట్టెను పీటపైఁ బెట్టి తాను వేఱొకచోట గూరుచుండును)

రత్న—ప్రాణేశ్వర! ఈసురటిచే మీ యలసటను మాన్పెదను. (విసరును.)

చంద్ర—ఓప్రమదామణీ! నీయుపచర్యనాకరండమునఁ గల యిష్టదైవమునకుఁ జేయుము

రత్న—(తనలో) ఏమిది! ఇంతభక్తి యిట్టి యాచార మెందును గానలేదే? అయిన నటులే చేసెదను! (పెట్టెకు సమస్తోపచారములను జేసి పిదప భర్తకుఁ జేయనారంభించును.)

చంద్ర — ఓపురంధ్రీరత్నము! తాళుము. నీ వన్నివిధముల ధన్యవే సుమీ!

రత్న — దేవరకుఁ బత్నినౌటచే నే నన్నివిధముల ధన్యనే. వేఱె చెప్పనేల?

చంద్ర — అందువలనఁ గాదు. దేవపతి నర్చించుటచేత.

రత్న — దేవతారాధన మెల్లరకుఁ గర్తవ్యమె. అందుఁ గ్రొత్తయేమి కలదు!

చంద్ర — క్రొత్తలు కాకేమి. అనుపమాన పరిమళోపేతమై నానావర్ణవిభాసురమై కన్నులకు విందు గొల్పు నాపుష్పరాజమును జూచితివా, యెంతమహదానందసౌఖ్యకరంబుగనున్నదో? భగవన్నిర్మితపదార్థములతో సమానముగునటు లేచిత్రకారుఁడైనఁ జేయఁగలఁడా?

రత్న — ప్రాణేశ్వర! ఔ నది సత్యమే. భగవత్సృష్టివలనఁ గలిగిన యానందమును మించినది కలదని యెవరు చెప్పఁగలరు?

చంద్ర — సరికదా! అట్టియానందమే బ్రహ్మానందము. అదియే యిహపరసౌఖ్యము. అదియే మోక్షము. అదియే పరమార్థము. అదియే జీవన్ముక్తి కావున మనమిరువురము పరమేశ్వరధ్యానానంద మనుభవింతము.

రత్న — (తనలో) మొదటినుండియు వీరితీరు వేఱుగాఁ గనుపట్టుచున్నది నేను కొంచెము గంభీరముగా ముచ్చటించి వీరి యుదంతమారసెదను (ప్రకాశముగా) దేవా! మీరు వేదాంతములు మెండుగాఁ బఠించినటు లున్నవారు ఆయుపనిషత్తులలో శుక్లైకాదశినాడు కాంతలకుఁ గళాస్థాన మెచ్చటఁ గలదని వ్రాయఁబడినదో వచింపఁ వేడుచున్నదాన.

చంద్ర - ఆప్రశంస యుపనిషత్తులలోఁ బనికిరాదు.

రత్న — అటులైనఁ గాముకశాస్త్రాధ్యయనస్థానమైన కేళీశాగృహ మునఁ బరబ్రహ్మవిచారము మాత్రము పనికివచ్చునా? ఇవేటిమాటలు?

చంద్ర — ఓసుశీల! అది నిజమే, కాని, వివేకులైనవారు శాశ్వత సౌఖ్యమునకై యాశింతురుకాని తాత్కాలిక సౌఖ్యముల కాశింతురా?

చ. ఇలజనియించుటే నరకహేతువు జీవుల కంతకంటెఁ గాం
తలఁ గవయన్ సుమాదులను దాల్చుట వీడెముసేయు టాదిగా
గలిఁగిన యట్టియైహికసుఖంబులఁ దేలుట జన్మజన్మలన్
దొలఁగని దుఃఖసంతతులతోఁ దులఁదూగుటకే తలోదరీ!

రత్న — ప్రాణేశ్వర! మీవైరాగ్యముఁ జూడ మిక్కిలి యాశ్చర్య మగుచున్నది.

ఉ. వేసపుఁ దీరుచూడ నరవిందశరున్ వలపించు మీ యుప
న్యాసము కాముకాగ్రణులనైన విరాగులఁ జేయఁజాలు మీ
కోసరసాగ్రగణ్య! ఇది యుక్తమె నీప్రియురాలి కిట్టి యా
యాసముఁ గొల్పుచుండుట దయారస మొల్కఁగఁ గౌఁగిలింపవే.

చంద్ర — వేషముఁ జూచి నీవుఁ శంకింప వలనుపడదు.

మ. లలనా! ఏటికి భ్రాంతిఁ జెందెదవు వాలాయంబుగా మానసం
బలసర్వేశ్వరు నందుఁ జొన్పుటయె ముఖ్యంబైన ధర్మంబు కే
వల వేషంబున నేమిసార్థకము భాస్వంతంబు కాశాల్మలీ
ఫలముల్ భోజ్యముకావె చిత్తమునఁ జేపట్టందగున్ మోక్షమున్.

రత్న — ఓప్రాణేశ్వరా! ఇది మీనిశ్చితాభిప్రాయము కాదు. నాయుద్దేశమరయుటకై నన్నీరీతిఁ బరిహాసముఁ జేయుచున్నవారని తలంచెదను.

చంద్ర — ఓసాధ్వీరత్నమ! కలనైన నీతఁ డనృతమాడువాఁడు కాఁడే!

రత్న—ఓసుందరాంగ! అట్టులైన నిది నాదురదృష్టమా!

చ. పరిణయమైన దాది మిము భావమునందునఁ జేర్చికొంచు మీ
సురుచిరమూర్తి నేగడియుఁ జూడఁగఁ గల్గునొ హాయిగా సుఖో
త్కరములఁ దేలనౌనొ యని కాలముఁ బుచ్చెదు నాదుకోర్కె నీ
కరణిని వీటిఁబుచ్చి ననుఁ గౌఁగిటఁ జేర్చవు నాయభాగ్యమా!

చంద్ర—ఓకాంతా! నీవు నిజముగ నజ్ఞానాంధకారంబునఁ దగు లోకనఁ జూచుచున్నావు.

మ. అతివా! నీకిది యేమి వెఱ్ఱి స్థిరసౌఖ్యమ్మున్నదిన్ గోరి స
ద్గతిఁ జెందన్వలెఁ గాని తుచ్ఛసుఖముల్ కాంక్షించి దుర్లోక సం
గతికిన్ బోవఁగఁ జూచుచుంటివయయో కామంబు దోషంబు పె
న్వెతలన్ ముంచును జన్మజన్మలకు దానిన్ జూతురే సజ్జనుల్.

అదికాక

గీ. కామమోహాది షడ్గుణ స్తోమబంధ
ములను బడి యిహసుఖముల ముఱసెదేల?
భవగహనసంతతికి దావపావకుండు
విష్ణుఁ డతనిపదంబుల వినుతి మఱచి.

రత్న—ప్రాణేశ్వర! ఇది వినుండు.

గీ. ఐహికసుఖంబు లందని యట్టిమనుజుఁ
డెట్టు లాముష్మికసుఖంపుఁ జెట్టఁబట్టుఁ
గామికాకుండఁ దామోక్షగామి కాఁడ
నెడు బుధోక్తుల మదినేల నిల్ప వొక్కొ.

అదిగాక కామసుఖము గర్హ్యమనికదా! చెప్పుచుంటిరి.

మ. పురుషార్థంబుల లోనఁ గామమొకటై పొల్పారుచుండుంగదా!
పరమామోక్షమ్ము కంటె ముందుగ వచింపన్ లేదె? కామంబునా

చరణాంబుజ బూనరింపకే యెటులు మోక్షప్రక్రియన్ జాతు మీ
విరహాగ్నిఁ బడినాఁప్రవేఁడెదను రావే కౌఁగిలీవే సఖా!

(సమీపింపఁ బోవును.)

చంద్ర సుందరీ! త్వరఁబడకుము.

ఉ. కాయము రోగపీడితముగా నొనరించును దుఃఖవారిధిన్
ద్రోయును పాపశోకముల దుర్గతులఁ బడఁద్రోయు సత్యముల్
బాయఁగఁ జేయు యౌవనము; పండితురాలవు నీవు తుచ్ఛముల్
హేయ మనోజ సౌఖ్యము లిసీ! మది కోరెదె? మూఢచిత్తవె.

రత్న—దేవా! నారికేళపానరన్యాయముగా నేదో యొక సంగతి ననుసరించి యట్లు వాదెంచుచున్నారు కాని నిజమారయుట లేదు.

చ. సంతతిలేనివారలకు సద్గతు లెట్టులు సంభవిల్లునా
సంతతి నెట్లు పొందనగు జాయలఁ గూడకయున్న వేద వే
దాంతములఁ బఠించియు మహాఘనులై తల్లక్రిందుగాఁ దపం
బెంత యొనర్చినఁ సతుల నేలకయుండిన రావు సద్గతుల్!

చంద్ర—ఓసఖిలలామ! నీయుపన్యాసము కామశాస్త్రోపపత్తిని స్వీకరించుచున్నది. నేను మాత్రమా మార్గము నవలంబింపను.

రత్న—ఓకపటనాటకాధ్యక్ష! ఇట్టి వాడవు తొలుత నన్నేల పెండ్లి చేసికొంటివి? నీ వేదాంత మావివాహసమయమునం దేగంగలోఁ గలసినది! లేక యింతలోనే యింత వేదాంతము ముదిరెనా! నాకు త్రుక్కఁ గోయుటకుఁ గాక నన్నేల పెండ్లి చేసికొంటివి?

చంద్ర—ఓరమణీ! నాకీవైరాగ్య మాదినుండియుఁ గలిగినదే. నీవివాహ సమయమున నీచేతి పూలసరమును ధర్మాధిష్ఠానరూపుండును సత్యాత్మకుండైన దైవప్రభువునకే సమర్పింపఁ జేసితిని. నిన్ను భగవంతునకే పెండ్లి చేసితిమి కావున నన్నేల కామించెదవు? సంతతభగవదారాధనాతత్పరవై సచ్చిదానందపరబ్రహ్మావలోకనంబునజీవయాత్రగడుపుము.

రత్న—(తనలో) అయ్యో! దైవమా! ఈయనకీవేదాంతముపదేశించి నా యాశాలతికను ద్రెంచినవా రెవ్వరోకదా! ఇఁక నీవిరహావేదనను నే నెటులోర్తును? హా! పంచశరా! నీకు సమయము దొరకినది కాఁబోలు నిదే నీకు శరణమను చున్నదాన, నంతవఱకు నీపంచమబాణమును నాపై గురిచేసి చంపకుము. (ప్రకాశముగా) నాథ!

గీ. కామదూరుండవై నన్నుఁ గామబాణ
కీలలకుఁ బాలుగావింపనేల సఖుఁడ?
అతనుసౌఖ్యాబ్ధిఁ దేలించి ప్రాణదాన
మీఁగ దేకాంత విలపింప హితకరంబె?

చంద్ర—కం. సకియా! ప్రాణము లీయఁగ
సకలసమర్థుఁడగు విష్ణు శరణు గనవగున్
సకలంకైహిక సుఖముల
నిఁక నాసరిఁ జెప్పఁబోకుమీ! విరహమునన్.

రత్న—ప్రాణేశ్వరా! తల్లిదండ్రులును భార్యయు లేక ప్రాపంచిక సౌఖ్య మెఱుంగక భగవంతుఁడు స్త్రీపురుషులను సృజించిన హేతువు నెఱుగని మానవమ్మన్యుని బోల్కి మీరు సంచరించుట పాడికాదు. నరజన్మమెత్తినందులకు నిహసుఖముల ననుభవించి పిమ్మటఁ బరసుఖముల ననుభవింపవలెను. ఇహము లేక పరముండనేరదు కొంచెమాలోచించిన మీకే తెల్లమగును. వేయియేల? ప్రథమసోపాన మెక్కకుండ నంత్యసోపాన మెట్లెక్కెదరు? కావున నావిన్నప మాలించి నీప్రేయసిపై విజృంభించిన యీపంచశరుని గండడఁగింపుము.

చంద్ర—ఓసాధ్వీమణి! నీమాటలు నా చెవికి సోకవు. నీకిచ్ఛ యున్నయెడల నావలె ముక్తసంగవై యోగిజనాదరణీయమైన మార్గమవలంబించి పరమును గనుము.

రత్న—అక్కట! దేవ! మీకిది యేమివెఱ్ఱి

సీ. శృంగారరసము వర్షించు మీనెమ్మోము
వెలిబూదిమించు రేఖలకుఁ దగునె?
తేటినారుల సౌరుఁ దెగడు మీవెన్నరుల్
తగునె కెంజడలబంధమ్ములకును?
సకియహారపుఁ జిక్కు సవరింపఁగల వ్రేళు
లెటుల రుద్రాక్షల పటిమకోర్చు
వెలఁదికి నమృతంబు విందుఁజేసెడు మోవి
చులుకాంబువులఁ గ్రోలఁగలుగు టెట్లు?

గీ. నవనవోన్మేష మీ యౌవనంబ దేల
యీశ్వరారాధనము లేల? యెమ్మెకాఁడ
పంచశర సౌఖ్యసామ్రాజ్యపట్టమునకు
రాజవై యేలుకొనుము శ్రీరాజమాన్య.

చంద్ర—ఓచామీకరగాత్రి! కాముకీ జనులపోల్కి నీవును నిస్సారము నిస్తేజమునైన మోహాంధకారమునఁ జిక్కువడినావే! నీ చదువెల్ల యీవృథముగాఁ బరిణమించినందులకు యోచించుచున్నవాఁడను.

సీ. మొగము చంద్రుడటంచు మోదించెదరుకాని
దుర్గంధయుత మని దోఁచ దకట!
కనులఁగల్వల పోలికను నుతింతురుకాని
పలలగోళకలంచుఁ బలుకరెందు
కుచములు బంగారుకుండలందురు కాని
దుర్మాంస శకలవర్తులము లనరు.
పెన్నంటియాకుల చెన్నటందురుకాని
పొలుపొందగా నస్థిపుంజమనరు,

గీ. అకట మలమూత్ర భూయిష్ట మైనతోలు
బొమ్మఁగాంచి మనోరథంబులు చిగుర్ప
నైహిక సుఖంబులను గూడి యందరాని
మోక్షమంచ చెడిపోవు మూర్ఖుఁడ నొకో.

రత్న — అయ్యో! దైవమ! నేనెంత బతిమాలుకొనినను దాఁ బట్టిన కుందేటికి మూఁడేకాళ్ళనుచున్నటులు తనపట్టు వదలకున్నవాఁడు. నేమన్మథానలమున దగ్ధమగుట నిశ్చయముగాఁ దోఁచుచున్నది. ఇఁక నా కేది దిక్కు? ఓ నానాయకా! అగ్నిసాక్షిగ నన్నుఁ బరిణయమైన న్నొల్లననుట ధర్మముకాదు మీరు నిరాకరించినచో మన్మథునిచేత నో లేక బలవంతముగానో ప్రాణముల దొఱఁగుట నిశ్చయము.

చంద్ర — ఓకాంతామణీ! ఆత్మహత్య మహాపాతకంబు నేఁ జెప్పినట్లు దైవారాధనఁ జేసికొనుము, నేనుమాత్ర మాతుచ్ఛసుఖము.రకు సిద్ధపడను.

రత్న—(తనలో) హాదైవమ! నన్నిట్టిదుఃఖసముద్రమున ముంచి వేయుటకు నే నేమిపాపముఁ జేసితిని. ఏజన్మంబున నెవ్వరి కెడఁబాటు చేసితినో కదా! అయ్యో! నేనిట్లు విలపించినఁ గార్య మేమి? ఇంకను ప్రాణేశుని ప్రార్థించెదను ఓప్రాణేశ్వరా! నాకు మహాపాతకంబు వచ్చునని శంకించుచున్నారుకదా! అటు లేల కావలెను? ఏలుకొనిన దయ యుంచి యేలుకొనుఁడు లేకున్న మీచేతులతోఁ జంపివేయుఁడు కాని నేనుమాత్రము మిమ్ములను విడిచి యీస్మరాగ్ని కాహుతి కాఁజాలను. (కౌఁగిలింపఁబోవఁ ద్రోసివేయును.) హా! పరమేశ్వరా! (మూర్ఛిల్లును.)

చంద్ర—(తనలో) బాగు! బాగు! రాజద్రోహము సేయకుండ నే నిప్పటికిఁ గదా యీకాంతనుండి తప్పించుకొని కృతకార్యుండనైతిని. ఈసమయంబున నే నీమెకుఁ గన్పడకుండఁ బోయినచో నన్నుఁ

గానక కొంతసేపు విలపించి పిమ్మట నీపెట్టెను దెఱచి యందున్న బాలకుని వాని మెడనున్న వృత్తాంతపత్రికను వీక్షించి నిజముఁ దెలిసికొనును. కావునఁ బరులెఱుంగకుండ మాపురమునకు నేఁబోయెదను.

(నిష్క్రమించును)

రత్న—(లేచి నలుదిక్కులు చూచి) ప్రాణేశ్వర! ప్రాణేశ్వర! ఏమి! ఎందును గానరాకున్నవాఁడు! హా! అట్టివాఁ డిచట నున్న నేమి! అయ్యో! నే నటు లనుకొనుట భావ్యమా? వెతకెదను! ప్రాణేశ్వరా! ఎందు డాగితివి? అయ్యో! నీజాడ దెలియకున్నది గదా!

గీ నాథనైన నన్నిట్టు లనాథఁ జేసి
పాడియే నీకుఁ బోవంగఁ బ్రాణనాథ?
కరుణమాలినచిత్తంబు కలజనంబు
లవ్యయానందవార్ధి నోలాడుటెట్లు.

అక్కటకట నాథ! నీయిల్లాలి నొకతుంటవిలుకాఁ డంటి వేధించుచుండ నీ వుపేక్ష సేయుట న్యాయమా!

చ పరభృతమంజులస్వరము పర్వ మిళిందపుమ్రోల్వగూర్చి యా
మరుఁ డరవిందకుందసుమమార్గణజాలము లేయ సాఁగె నో
సరసుఁడ! నాదుమేన విరసం బగుచూడ్కు లఁ జొన్పఁ బోక స
త్వరమున వచ్చి కావుము కృపారస మొల్కఁగ నీసతీమణిన్.

అదె వారియిష్టదైవముగలకరండము ఆయన నిజముగా వెళ్లియుండినచో దీనిని విడచిపోవు టెట్లు సంభవించును! కాన నిశ్చయముగ మఱి యెందుల కే నేగనోపు. ఇంతలో నీయన యిష్టదైవ మన నెట్టిదో చూచెదను (పెట్టెను తెఱచి కని) ఆహా! యేమిది! ఇందులకీశిశు వెక్కడనుండి వచ్చినది? ఈబాలుఁ డీయన కిష్టదైవ మెట్లయ్యో! పెట్టె దీయఁగనే వీని తేజఃపుంజంబు దిక్చక్రంబుల నాక్రమించె. (పరిశోధించి)

గీ. బాలుఁడు పురిటింటిలోపల వానివలెనె
తోఁచు మొగముఁ జిరునవ్వు తొంగలింప
దేహకాంతులు చంద్రునికే ప్రతికంబు
మించి వెలుగొందు జనులఁ బ్రేమింపఁ జేసె.

(నిదానించి చూచి) ఇతని మెడ నేదియో పత్రిక కన్పించుచున్నది. చూచెదను (విప్పిచూచి) హా! పరమేశ్వర! (మూర్ఛిల్లి లేచి) ఈపంద్రెండురోజుల పిల్లవానిని నాకుఁ బలిగాఁ జేసితివా? హా! భక్తరక్షకా!

అట్టివాఁడవు నాకీయాపద మేల కల్పించితివి. పాలుత్రాగుట సైతము నెఱుంగని యీ బాలునితో నా నేనుగాపురము సేయుట! కటకట! నాజవ్వన మంతయు శూన్యగేహమున కెత్తినదీపికవలె వ్యర్థ మయ్యెఁ గదా!

అయ్యో! ఇఁక నాకేది దిక్కు? (ఆలోచించి) ఇఁక దైవమే దిక్కు. ఓశంకర! నెఱజవ్వనమునను న్న న న్నీబాలుని కంటఁగట్టి పలు వెతలపా లొనర్చితివా! యీ శిశువునకు నాయువును బోయలేకపోయితివా! అందులకై నా కుత్తుక గోసితివా! ఇఁక నీకన్నులు చల్లపడెనా! శివశివా! ఇఁక నే నెందుఁ బోదును. ఈసంగతి మాత్రము పెదలకుఁ దెలిసిన చోఁ జంద్రచూడమహారాజును పుత్త్రకళత్త్రాదులతో నంతమొందింపఁ గలఁడు కావున నీవిషయము మాయన యెఱుంగకుండ నే నీబాలునిఁ దోడ్కొని యరణ్యంబుల జొచ్చి యందు వసించి పోషించుకొనుచుఁ గాలము గడపెద. కొంతకాలమునకైన నాకోర్కె తీరకుండునా? ఈచంద్రకాంతుఁడును శంకరవరప్రసాదసంభవుఁ డనుచు వ్రాయఁబడియున్నది. కావున నేనరణ్యములకై పోయెదను. ఓకేళికాగృహలక్ష్మి! నీయలంకారము వ్యర్థమైనది సుమీ! యేల యన నిర్భాగ్యురాలనైన నానివాసము వలన. ఇపుడు నిన్ను విడచి నేనడవులకుఁ బోవుచుండుటచే నీ వన్యకార

ణమున నేని సమగ్రఫలసంపత్తి నందగలవు. ఓగృహలక్ష్మీ! నా కీ(క సనుజ్ఞ-

అయ్యో! నాకు నోరు రాకయున్నది ఎంత యేడ్చిన నేమి లాభము?

సీ. కమనీయమణి దీపికాకరాంచిత హైమ
భంజికలార హృద్బంధులార!
అనుపమానందంబుగను కీవి నాడెడు
మురిపెంపు టంచపావురములార!
శ్రుతి కింపుఁ బచరించు రుతిమించులీల వే
చెలువొందు పెంపుడు చిలుకలార
పంచమస్వరము పర్వఁగ జిత్రకథలల్లి
ప్రియము గొల్పెడు పౌరపికములార!

గీ. పరమసంతోష మిడు చిత్రపటములార!
సరసకవితా విశేషశాస్త్రంబులార!
నను మరువఁబోకుఁ డోసఖీజనములార!
సెల వొసంగరె నా కిఁకఁ జెల్లె ఋణము.

ఈవృత్తాంతము మాతండ్రిగారెఱింగి నామామగారిని శిక్షింపకుండ
నేను పోయెదను. (నిష్క్రమించును.)

శ్రీ

# చంద్రకాంతనాటకము.

## పంచమాంకము.

[ఒకరాక్షసుఁడు ప్రవేశించి]

అరే శోణపురరాక్షసులార! సేనానులార! మనరత్నమాల భర్త యనిపించుకొనుచున్నవాఁడు నిజమైనభర్త కాఁడనియు నాచంద్రకాంతుఁడు పసిపిల్లవాఁడనియు నీతఁడు మంత్రికుమారుఁడనియు చంద్రచూడుఁడు జరిగించిన వివాహము కపట మనియు నెఱింగి రత్నమాల పతియైనబాలకునిఁ దోడ్కొని గహనములకుఁ బోయెనని తెలిసికొని మనసింహకేతుమహారాజుగారు మితిమించిన కోపానలంబున మండిపడుచు చంద్రచూడునిపైకి యుద్ధమునకుఁ బైలుదేరుచున్నవారు. కావున మీరెల్లరు నప్రమత్తులరై సమరసన్నాహమున నుండుఁడని మహారాజుగారియాజ్ఞ యైనది. సిద్ధముగ నుండుఁడు. రెండు కుత్తుకబంటి దాక రుధిరము ద్రావి మైమఱచి నిద్రించు నీరక్కసు లూరక మేలుకొందురా! ఇనుపకాడలఁ గాల్చివెట్టినఁగాని మేలుకొనరు. అట్లే చేసెదను. మాఖరాస్యుఁడు రత్నమాల నరణ్యంబుల వెదకి తెచ్చుటకుఁ బోయినవాఁడు, కాని నాకంటె వాఁడు బాగుగఁ గాల్చును.

(నిష్క్రమించును)

ప్రవేశకము.

రంగము—అరణ్యము.

[బాలకునితో నరణ్యమున రత్నమాల ప్రవేశించును]

రత్న—హాపరమేశ్వర! హాజగద్రక్షక!

ఉ. పాములు బుస్సుకొట్టఁ బయిప్రాణము పైననె పోవఁగా మృగ
స్వాములు బొబ్బరింపఁగనె చప్పున గుండెలు వ్రీలఁగా ద్విప
స్తోమము గాండ్రు గాండ్రుమనుచో మెయినిల్వ నీరుగాఁగ నే
నేమియు సంభ్రమించెదనొ యీకడు ఘోరపుఁగాననక్కటా!

ఓరీ హతవిధీ! ఈఘోరారణ్యంబున నన్నుఁ ద్రోసి నీవు కానట్టు లూరకొంటివిగా!

గీ. పద్మరాగఖచిత మైనభర్మసౌధ
ములను మెలఁగఁగఁ నోడుదు శిల లటంచు
నట్టి నా కిట్టి భయదమా నడవియందుఁ
దిరుగఁ బ్రాప్తించె దుష్టవిధికృతి నహహా!

అయ్యో! ఈనాదయితుం డేడ్చుచున్నవాఁడు. ఈయరణ్యంబునఁ బాలెటులు సంపాదింతును? దైవమా! హతవిధి! బాలునిసైత మేడ్పింపవలెనా? హాపరమేశ్వరా! ఈపసికూన నెట్లు మనుపఁగలను?

సీ. జోలపాటలఁ బాడుసొంపు నెఱుంగ నే
లీలనీబాలు లాలించుదాన?
ఉగ్గు లరఁగ నెవ్వియో మూల మెఱుఁగ నీ
శిశువు నేగతిని రక్షించుదాన?
అంగరక్షలఁ గొంచెమైన నెఱుంగ నీ
కందు నేచందాన గాచుదాన?
జలక మాడించుప్రశంస యెఱుంగ నే
చెన్నునఁ బతిని బోషించుదాన!

గీ. ఘోరవనములఁ బొలెట్లు కూర్చుదాన?
పొందుగా నూనె నేకియఁ బూయదాన?
కాయమున కేవిధిని వేడి చేయుదాన?
నిసువు ప్రాణంబు లేరీతి నిలుపుదాన?

ఓవనతరుజంతుసంతానములార! మీరైనఁ బ్రోవరాదా!

సీ. పతి దైవమనుచు నామతి నమ్మి వచ్చితి
మధువిచ్చి ప్రోవరే పూవులార!
ఆకొన్న నాదైతుఁ డడలుచు నున్నవాఁ
డాలించరారె పికాళులార!
మకరందములను డింభకునిఁ బోషింపంగ
రారె యోసత్పుష్పమరంబులార!
పాల నించుక యిచ్చి భక్తితో నాపతి
గావరే యోవనగోవులార!

గీ. ఎంత ప్రబతిమాలుకొనినఁ గాసంతయైనఁ
గరుణ లేకుండెనే వనాగంబులార!
ఆపదలయెడ రక్షించునట్టివారె
యాప్తులగుటది యెఱుఁగరో యగములార!

హా! దైవమ! నేనెంత ప్రబతిమాలుకొనినను వీనిలో నొకటియు నాదీనాలాపముల నాలింపదాయె నే నెంత పాపముఁ జేసితినో కదా! ఈరాకుమారు నే నెటులు పోషించుదాన? (ముల్లు గ్రుచ్చుకొనుట నభినయించి) అబ్బా! ఈముల్లు గ్రుచ్చుకొనుటచేఁ దేలు కుట్టినటుల భగ్గున మండుచున్నది.

ఉ. కాళుల ముల్లు గ్రుచ్చుకొనఁగా సహియింపని నాకు ఘోరశా
ర్దూలవరాహనాగవృకదుష్టభుజంగవిహంగమాకులా

భీలవనంబునం బతినిఁ బెంచుచు నీవిధి నష్టకష్టముల్
చాల భరింపఁగావలసె సారసగర్భవిధాన మక్కటా.

[తెరలో వ్యాఘ్రరవము.]

(వినిభయమునభినయించి) అబ్బా! యీధ్వనినాకుఁ జైతన్యమునుదప్పించినది. (చూచి) అల్లదె వ్యాఘ్రము. (ఉద్దేశించి) ఓ వ్యాఘ్రమా!

చ. కనికరమూని నాపతిని గాఁవఁగ బూనదవేని నీకు నా
తనువు నొసంగెదన్ రుధిరధారలఁ గ్రోలి పిపాసఁ దీర్చి కో
మ్మనువుగఁ గాననాంతరములం దట బాముల కోర్వఁజాల ఘో
రనరకవాసమే హితకరంబని తోచెను వ్యాఘ్రరాజమా!

అక్కటా! ఈపెద్దపులి నన్నుఁ జూచి వెనుకకుఁ బారిపోవుచున్నది. దాని ప్రాణములకు నేనే మిత్తివలెఁ దోచితిని కాఁబోలును. ఈమృగములన్నియు బ్రహ్మాండ భాండకర్పరము వగులనార్చుటయేకాని నన్నొక్కటియు మ్రింగదయ్యె. నే నేమిసేయుదును. ఈయరణ్యమున దారిఁ గానక కీచకగుల్మంబుల నొత్తిగించుచు నడువ ముండ్లు గ్రుచ్చుకొని వేయి తేళ్లొక్కసారి గుట్టినట్లు మండుచున్నడి. హా దైవము! ఈబాధనుండి మమ్ముఁ బోలఁగించువా రెవ్వరు? అల్ల శీతలచ్ఛాయలచేఁ బ్రాణదానంబుఁ జేయఁజాలిన యీసహకారము నాశ్రయించెదను. (సమీపించి) అయ్యో! కళపిలకాగుచుండు తైలముపైని నుదకశీకరములఁ జల్లినటు లీతీయమావిగున్నం గలపూగుత్తులు విరహభరపీడితురాలనై యున్న నాయెడల దనపంచశరసాయకత్వమును జూపుచు నిమ్మళిగ బాధించుచున్నవి. (తలయూఁచి) అకటా! నైజగుణమునకు మందు లేదుకద!

గీ. ఊరకే వేచ మీకిది యుచిత మగునె?
పగనుసాధింపఁ దలఁచినఁ బ్రాణములను
దీయవలెఁగాని, వ్యర్థవృత్తినిఁ జరింపఁ
గార్యసాఫల్యమే సహకారులార!

హాదైవమ! పేరాకలిచే సీరాకుమారుని కడుపు వెన్నున కంటికొనిపోయి నది ఇంతవఱకు క్షుద్బాధచే నేడ్చియేడ్చి యిప్పు డేప్పుట్కైన శక్తి లేక వాఁకుతేరెన తామరతూఁడువలె వ్రేలఁబడి కన్నులు మూసికొన్న వాఁడు. (చూచుచు)

క. నీకనుదమ్ముల యందము
నా కేలొకో చూప విపుడు నాయక! క్షుధచే
వ్యాకులమున మూసితివే
రాకాసీతాంశుఁ గనిన రాజీవమునన్.

హా ప్రాణనాయకా! నీ వెపుడో నవవయస్కుండవై నామనోరథం బీడేర్చెదవని పేరాసచేనున్న నన్నిట్లనాదరణఁజేసి చూడకుండుట న్యాయమా?

కం. ఎల్లప్రాయముగలిగిన నీ
కలకలనెమ్మోముఁ జూచి కడువిరహమునన్
గలలోసైతము నీదే
హాలతనె చిత్తమున నిడి మహాప్తత గందున్.

హాప్రాణేశ్వర! ఇపుడు మనల రక్షించువా రెవ్వరు? దిక్కుమాలిన వారికి దేవుఁడే దిక్కనుచ నెల్లన్ని యిక్కట్టులఁ బెట్టుచున్నను బరమేశ్వరుఁడే రక్షకుఁడు. ఓపరమేశ్వర!

దండకము. శ్రీదివ్యకైలాసవాసా భుజంగేశభూషా! కృపాసాంద్రకల్లోలి నీశా! మునీంద్రాదితోషా! సురేంద్రాదిపోషా! విపత్షోఘశోషా! భవత్పాదనీరేజయుగ్మంబునే మానసంబందు సేవించు నన్నున్ గృపన్ జూచి యస్మన్మనోనాయకుం డాఁకటన్ గుందుచున్నాఁడు దాక్షాయణీనాథ రక్షింపు రక్షింప దక్షుండ వీవేకదా! దేవదేవా! మముం గావ లేవా? యఘూరణ్యదావానలా! భక్తచిత్తాంబుజాతాధివాసా! లసత్కృత్తివాసా! మహోల్లాస జోహారు జోహారు జోహారు లోకశంకరా!

ఆహా! అద్భుతదేదీప్యమానమై తేజస్సు పుడమి కన్నులకు మిఱుమిట్లు గొల్పుచున్న దిదియేమి చెపుమ (చూచి) ఓహో! ఇద్దఱు దివ్యపురుషు లాకాశయానమునుండి యరుదెంచుచున్నవారు. వారిశరీరకాంతు లిట్లు వ్యాపించుచున్నవి. ఇఁక నేను ధన్యురాల నగుదు నేమొ

[అంతట నశ్వినులు ప్రవేశింతురు.]

అశ్వి—ద్విపద. కాంతరో! పార్వతీకాంతునికృపను
కాంతుఁ డాయెను జంద్రకాంతుఁడు నీకు
నతఁ డల్ప మగునాయు వంది యుండుటను
పతిగాఁగ నినుఁగొన్న సంపూర్ణజీవి
యగుటయు విధికృతం బౌటను జేసి
మగనిఁ జేసిరి నీకు మదిఁ బొగలకుమి.
కారణాంతరమునఁ గడగండ్లఁ బడఁగ
దారసిల్లెను నీకుఁ దల్లిరో వినుము.
ముందు నీపతితోడ మోదంబు లెల్లఁ
జెందెద విఁక నీకుఁ జేటులు లేవు
క్షుత్పిపాసలు మిమ్ముఁ జొరనేర వింక
తాత్పర్యమున భర్త నెంచి సేవింపు,
మిదె వానియంగుళి నిడెదము సుధను
ముదమున నోటికిఁ గదియించు మమ్మ.

కళ్య—మహాత్ములార! మహాప్రసాదము. ఈనాథయితుండు సకలకళాప్రపూర్ణుఁ డగుట కనుగ్రహింపవేఁడెద. నా కీయవ్యాజ కరుణాకటాక్షపూర్వకముగు నుపకృతిఁ జేసిన మీనామములఁ దెలిపి నావీనుల సార్థవంతములుగాఁ జేయుఁడు.

అశ్వి—ఓసాధ్వీమణి! గురుసందర్శనమాత్రమునఁ నీనాథుండు సకలకళాప్రవీణుఁడును ధీరోదాత్తాదిగుణములుకలవాఁడునగును. మేమశ్విను

లము. నీప్రార్థనమునకుఁ గరుణించి పార్వతీవల్లభుండు నన్నుఁ బంపఁగా వచ్చినారము.

రత్న—ఆర్యులార !

క. ఏప దంభోనిధి మునుఁగుచు
నుపమింపఁగరానికష్ట మొందెదు నను మీ
కృపచేతఁ బ్రోచితిరి యే
తప మొనరించితినొ మున్ను ధన్యులఁ గనుటన్.

అశ్వి—ఓపతివ్రతారత్నమ ! మేము పోయెదము.

రత్న—పూజ్యులార ! రక్షకులార ! మీకుఁ బదివేల వందనములు.

అశ్వి—సంతతసుఖీభవ ! (నిష్క్రమింతురు.)

రత్న—ఆహా యేమి! నాభాగ్యము? భగవంతుఁడు కరుణాళుండై రక్షించెను. క్షుత్పిపాసలవల్లను మృగాదులవలనను భయము లేదుకదా! ఇదే నాదయితుండును

గీ. తెల్లవాగునపుడు తెల్లతామరతీవ
పూవు విడుచుమందు పోల్కి నహహ
అమృతపాన మందినపు డల్లను విభుండు
కన్నుగవను దెఱచుచున్నవాఁడు.

కావునఁ గొంతకాలము మానూతనపత్రములచే నొప్పు వటవృక్షము క్రింద వసించి యీనిదాఘదినసంబులఁ గడపెదను.

(నిష్క్రమించును.)

శ్రీ

# చంద్రకాంతనాటకము

## షష్ఠాంకము

రంగము — చెరసాల.

[చంద్రచూడుఁడు ప్రవేశించుట.]

చంద్ర — హా భగవానుఁడా ! శంకర ! నీకృతులు సర్వథా వక్రతమములు సుమి ! యేలయన

ఉ. ఆయువు లేనిపుత్త్రుని దయారస మొప్పఁగ నిచ్చి వాని దీ
ర్ఘాయువుఁ జేయ ఘోరతపమై తగుతంత్రముఁ జేయఁ బూనఁగా
నాయతనంబునందును మహాతతకష్టము లందఁ జేసితే
శ్రేయమె పైని నీరములఁ జిల్కుచుఁ గ్రిందను మంట బెట్టుటల్.

ఓభూతనాథ ! నీ వనుగ్రహింపనని యన్నచో నిన్నేమయిన నిర్బంధముఁ జేయుదుననుకొంటివా! ఏమి నావెఱ్ఱి! నన్ను నిగ్రహించుటకు దలఁచిన వాని ననుగ్రహించినాఁడని పలుకుచున్నాను! ఇసీ! అటు లనరాదు నా పురాకృతకర్మను నే ననుభవింపక యెవఁ డనుభవించును అందువలన భగవంతుఁడు నింద్యుఁడు కాఁడు. ఓశంకర!

చ. ఒకపరిగద్దెమీఁద నధికోచ్చగతిన్ వసియింపఁ జేసి భూ
పకులము గొల్వ నింద్రసుఖవైభవరాజ్యము లెల్ల జేయు దిం
కొకపరి బందెలోపల మహోగ్రపుఁగష్టము లందఁ జూతు వింతకును మదీయకర్మఫలతంత్రము నిన్నననేల శంకరా!

అక్కటా! దిక్కుల నిండినకీర్తిగల నేను దిక్కులేక యొక్కపిరికితాళనునికి బద్ధుఁడనై యుండవలసివచ్చెనుగదా! ఆమంత్రులు నాపరివారము, నా పట్టమహిషి యేమయిరో! ఎంతవిలపించుచున్నారో తెలియకున్నది. అక్కటా! నే నిటుచేసితినని నాపైఁ జలంబున నారత్నమాల నావంశాంకురమును దనకు భర్తయునైన చంద్రకాంతకుమారు నొందేనిబారవైచి పోలేదుకదా! ఆమె మహాపతివ్రత. ఆమె కట్టిదుర్బుద్ధులు దూరములుఁ బాలకుఁడని నిరాకరింపక తప్పక పోషించి పెద్దవానిగాఁ జేయును హా! నా కట్టిభాగ్యము కలుగునా! నిశ్చయముగ నటులేయైన నే నెందు చచ్చినను ధన్యుఁడనే. చావ నేల? నామంత్రి మొదలగువారు నన్ను విడిపించుకొనఁ బ్రయత్నము సేయుకుందురా! అతఁడు స్వార్థపరుఁడు కాఁడు పరోపకారి ఓమంత్రిపుంగవులార! సేనానులార!

చ అధిపుఁడుపోయనంచుమదయందువిచారము మానుఁడయ్యమీ
ప్రథితబలంబుఁ జూపి యసురప్రభు దోలి స్వగౌరవంబు మా
నధనముల్ గ్రహించుకొని నన్నును దోడ్కొని పోవరయ్య యీ
విధిఁ దేలపోయి యుండుటలు వీరులకుం దలవంపు లౌనుఁడీ.

కటకటా! ఇచట నేనుండి ఎంత పరితపించి మొరవెట్టుకొన్నను ఆలకించువారెవరు? క్రమక్రమముగఁ గాలము మారుచుండుట హృదయములు గూడ మారగలవు.

చ. తెలివియు నాత్మగౌరవము తేకువయున్ స్వమతాభిమానమున్
దెలియక మూఢులై శిలలతెన్నున జ్ఞానములేమి నిద్రలో
పలను మునింగినట్టి నరపాంశులఁ గాల్చిన నేన్గు ద్రొక్కినన్
మెలకువరాదు నీతులను మెల్లనఁ జెప్పినఁ దెల్వి వచ్చునా ?

కావున నే నీచెరనుండి యనార్యమైనను, ఎట్టటులో తప్పించుకొని పోయెదను సమయమునకుఁ గావలివారును నిద్రించు చున్నవారు,

అల్ల గవాక్షమెంత బలవత్తరముగా నున్నదో చూచెదనుగాక (పట్టుకొని కదల్చివేసి తీయును) బాగుబాగు ఇది యొకమంచిశకునము.

(ఎక్కి క్రిందికి దుమికిపోవును) నే నెవ్వరికిఁ గనఁబడకుండ నడవిమార్గములఁబట్టి పోయెదను. నాభాగ్యవశమున బాలకుని గొంపోయిన రత్నమాల కనుపడఁగూడదా!

(నిష్క్రమించును.)

రంగము—అరణ్యము.

[చంద్రకాంత వనబాలకుల ప్రవేశము.]

పాట.

చంద్ర—

చెలువ్రుఁడ సింగపుఁబిల్లలతో చెలగాటంబుల నాడుదమా
కులుకుచు వీపుల నెక్కి ముదంబుగ మొలఁగి సవారుల జేయుదమా
అలయక గంతుల వేయుదమా.

వనబా—

సింగంబుల పదివేలబలంబుల గల నీ కది యొక బిరుదా
చెంగుమ దాటినఁ బడిపోవుదు కదు భంగం బగు నే ర్వాను సుమి
బొంగరముల యాటలు లేవ్వ.

చంద్ర—

పిరికిమాటలాడెద వేలాహరితో నాటలె యాటలురా
పరుగువారుసింగముపై నిలచియు సగుస మొగ్గలు వేయుదమా
సయ్యాటంబుల నాడుదమా

వనబా—

కృూరమృగంబులతో నాడ కూడదు బాలుర మగు మనకు

సారమైన పూదీవపు టుయ్యేలఁ జేరుచు దూగుచు క్రొత్త దమూ కూరిమి పూచెం డ్లాడుదము.

చంద్ర — ఓరీశబరకుమార! నీవిచట నేయుండి చూచుచుండుము నే నాసింగము నెక్కి సవారిచేసెదను.

(నిష్క్రమించును.)

వనబా — అమ్మయ్యో! చూపుల కుడుతపిల్లవలె నున్నాఁడుకాని సింగముపై నెంతసుళువుగా నెక్కి సవారిచేయుచున్నాఁడో! బలే కుమార! బలే! నీవు చిన్నవాఁడ వైనను కడుబలము గలవాఁడవు. అరరే! యెంతవింతో! సవారి జేయుచు చెట్లకొమ్మల బట్టుకొని సింగంబును కాళ్లతో సుళువుగాఁ బైకెత్తివేసినాఁడు! అబ్బో రబ్బో! యెంత చిత్రమో! అదిగో వదలివేసి తిరిగి సవారి .. అయ్యోఅయ్యో! క్రిందఁ బడవేసినది పారిపోవుచున్నది. అయ్యబాబో! యెంతసాహసమో తిరిగి లేచి దానికై పఱుగిడుచున్నాఁడు. వద్దువద్దు పోవద్దు. అరే పట్టుకొన్నాఁడు తిరిగి సవారిచేయుచున్నాఁడు. బుర్ర బద్దలకొట్టినాఁడు చచ్చినది. చచ్చినది. కళేబరమును చెవులపట్టుకొని లాగుకొని వచ్చుచున్నాఁడు ఆహాహా!

[అంతటఁ జంద్రకాంతుఁడు యథోక్తముగాఁ బ్రవేశించును.]

చంద్ర - ఓరీ దీనిని జూచితివా?

వనబా — బాబూ చూచినాను నీకు దెబ్బతగిలినదా! క్రూర జంతు వని నేజెప్పలేదా.

చంద్ర — అయిన నిపుడు నా కేమియు దెబ్బతగులలేదుగాని యీసంగతి మాఅమ్మతోఁ జెప్పకుమా!

వనబా — నే నబద్ధమాడను. ఆమె వచ్చుచున్నది నన్నదుగ కుండఁ జేసికొనుము.

రత్న—(ప్రవేశించి తనలో) ఆహా! నాభాగ్య మే మని చెప్పుదును మన్మనోహరుని కోర్కెలు నానాటికి కొనలుసాగుచున్నవి. (ప్రకాశముగా) రాజపుత్రా! నన్ను విడచి నీ వి ట్లొంటరిగా నేల వచ్చితివి?

చంద్ర—వచ్చిన నేమిభయము? పండ్లకై వచ్చితి.

రత్న—వానిఁ దెచ్చియిచ్చుటకు నేను సిద్ధముగా నున్నాను గదా.

చంద్ర—అయినను నాయంతట నేనే కోసికొనవలె నని యాస పుట్టి వచ్చితిని.

రత్న—నీకుఁ దేనియం దాసపుట్టిన దానికై యేగెదవా? అది తప్పుగాదా?

చంద్ర—ఇం దేమి తప్పు?

గీ. దేవుఁడే మనుజు లందఱు తినుటకొఱకు
వనములను పెంచియును ఫలింపంగఁ జేసె
వానిదినుటకు నాజ్ఞ కావలసె నొక్కొ!
ఎవరిసొత్తు వారలు భుజియింపఁ దగదె?

రత్న—(తనలో) ఆహా నే నెంత ధన్యురాలను! నామనోహరునితో శృంగారసల్లాపముల కిదియే ప్రారంభము. ఈసంభాషణ చంద్రకాంతున కజ్ఞాతరసగర్భిత మైనను జ్ఞాతయావన నగుటచే నాపాలిటి కిది యమృతోపమానముగ నున్నది. (ప్రకాశముగా) చంద్రకాంతా! యెవరిసొత్తెదో నీ వెఱుఁగుదువా?

చంద్ర—అమ్మా! తెలిసినంతవర కెఱుఁగుదును.

రత్న—తాళుము తాళుము. న న్నమ్మా! యని పిలువకుము.

చంద్ర—మ రెట్లు పిలువవలెను.

రత్న—రత్నమాలికా! యని పిలువుము.

చంద్ర—అమ్మయ్యో! నే నంత పేరునఁ బిలువలేను. కొంచెము కొంచెముగాఁ జెప్పుము.

రత్న—ర, త్న, మా, లి, క,
చంద్ర—ర, త్న, మా, లి, క, } (అని యొక్కొక్క యక్షరముగా రత్నమాల చెప్పగాచంద్ర కాంతుడు పలుకును.)

రత్న—రత్నమాలిక

చంద్ర—అమ్మయ్యో నే నంతపలుకలేను. ఊఁ ఊఁ.

రత్న—పోనిమ్ము ప్రియా! అని పిలువుము.

చంద్ర—ఏమని?

రత్న—ప్రియా

చంద్ర—(వ్రేళ్లు మడచి లెక్క పెట్టుకొనుచు) ప్రియా, ప్రియా, ప్రియా.

రత్న—(తనలో) ఆహా! నేటికి నాభర్తచేఁ బ్రియా యని పిలి పించుకొనుభాగ్యము నాకుఁ గలిగినదికదా! ఓయీ! రాకుమార! ఒక సారి యిటురమ్ము కౌఁగిలించుకొనెదను.

చంద్ర—వచ్చెదను కాని నా కిపుడు రెండుమామిడిపండ్లు కా వలెను. (వెనుకవైపు కనుపడనీక తిరుగును.)

రత్న—ముందు నాచెంతకు వచ్చినప్పుడుకదా ఫలముల నిచ్చు ట! యిచ్చెద రమ్ము సిద్ధముగానే యున్నవి (సమీపింపఁబోవును.)

చంద్ర—(తొలఁగి యందక వెనుకవెనుకకుఁ బోవుచు) నీచేతఁ జూపినఁగాని పండ్లున్న వని నేను నమ్మను.

రత్న—(సిగ్గు నభినయించి నవ్వి) ఓయి అటులె తెచ్చియిచ్చెద చెంతకు రమ్ము (సమీపింపఁబోవును,)

చంద్ర—(దూరమునకు వెనుకవెనుకకుఁ దొలఁగుచు) పండ్లి చ్చినఁగాని నేరాను.

రత్న—(నిదానించి చూచి) ఓయీ ఏమి నీవీపున దుమ్ము విస్తారమంటుకొని యున్నది యెందైన నఁ బడినావా యేమి?

చంద్ర—ఆటలవశమున నంటియున్నది

రత్న—(ఆతురముతోఁ జేరదీసికొని చూచి) ఓరీ! శబరకుమార! యీతని కీధూళి యెక్కడనుండి వచ్చినదో నిజము జెప్పుము. లేకున్న నిన్ను శిక్షించెదను.

వనబా—అమ్మా! నన్నేల శిక్షింపవలెను? ఆతఁడు సింగముపై నెక్కి సవారి చేయఁగా నది యాతనిం గ్రిందఁబడవైచినది.

రత్న—అక్కటా! చంద్రకాంత! ఏమి యీసాహసము! ఏమి యీమండగము! నీకు బుద్ధిచెప్పవలెనా!

చంద్ర—అతఁడు చెప్పినమాట నిజము. అందువల్ల నంత జడియవలసినపనిలేదు. సింగమనఁగా నెంత? పిల్లికిని దానికిని భేద మేమి?

రత్న—ఏమి! సింగమనఁగా నీభయము లేదుగా! నీ విట్టిసాహసములకు సిద్ధపడిన నెప్పుడేకీడు మూడునో! నాయాజ్ఞ లేకుండ నీయిచ్చవచ్చినటుల సంచరించుచున్నావు, కావున నాచెంతకు రాకుము పొమ్మని (అని త్రోసివేయును)

చంద్ర—(కౌఁగిలించుకొని) ప్రియా! నీకు నాపైఁ గోపమువచ్చినదా? ఇదిమొదలు నీయాజ్ఞ లేనిపని చేయను. నన్నొకసారి యెత్తుకొనుము నాకు మామిడిపండ్లు కావలెను.

రత్న—ఆఫలంబు లీయరణ్యంబున లేవు యీజామిపండును పుచ్చుకొనుము (అని యొకపండు నిచ్చును)

చంద్ర—అది నాకక్కఱలేదు. ఊఁ. (దానిని పాఱవైచి గంతులు వేయును)

రత్న—రాజకులావతంస! నీ వటులు పట్టుపట్టిన నే నేమిసేయు

ము! నీమనోరథంబు లెల్లఁ దీర్ప నేసమర్థురాలనా! కానుగావున నా మాట విని యీఫలమును బుచ్చికొని యూఱకుండుము.

చంద్ర అది నా కక్కఱలేదు (చిందులు ద్రొక్కును.)

రత్న—గీ రాజపుత్రా! ఇట్టిరంతులు సేయఁగ
జనునె చంద్రవంశజన్మ నీకు
నీవు కోరినట్టి నిరుపమఫలముల
రేపె యిచ్చుదానఁ గోప మేల?

అటులకానిచోఁ నీ కొకలేడిపిల్లను దెప్పించి యిచ్చెదను. దానితోఁ జక్కఁగా నాడుకొనవచ్చు నూఱకొనుము.

చంద్ర—గీ. లేడిఁగూడి యాడువాఁడఁ గాను గజముఁ
గూడి యాడుటకును గోర్కెకలదు
కాన పళ్ళెరమున గజము ను బెట్టి నా
కంది యిమ్ము యాడుకొందు నెలమి.

రత్న— బాగుబాగు గజముతోఁ గూడి యాడుకొందువుగా! దానిఁ బళ్లెరమునఁ బెట్టు టెట్లు? తెచ్చు టెట్లు? బహుసూక్ష్మమైనపని కాదా ?

చంద్ర— ఊ ఊ. ఊ. (అని యేడ్చును)

రత్న — చాలుఁ జాలు నిట్టిమంకుపట్టుఁ బట్టకుము. నీకోర్కెఁ దీర్ప నేసమర్థురాలనుగాను. ఆఁడుదాననైన నే నేమిచేయఁగలను! నీ వీపట్టు వదలుము

గీ కలువపూరేకుకొనలందు దళుకు వీను
వాఃకణములట్లు కనులరెప్పలకు దుదల
నశ్రుకణముల నిల్పి దైన్యరస మొప్పఁ
జేయ వే నెట్లు సైతు లక్ష్మీనివాస.

చంద్ర—అమ్మా! కాదుకాదు! ప్రియా! అటులైన

క. ఈవనబాలక మిత్రము
లావిధమున నమ్ములాట లాడ గమచు నే
నేవిధి సహియించెద నా
కావిలు నమ్ముల నొసంగు మామకొనఃప్రకై.

రత్న — అబ్బా! గొప్పకోంకలె పుట్టుచున్నవే! వానిప్రయోగ కౌశల మెఱుంగని నీవేమి చేసెదవు?

చంద్ర – ఏమిచేసెదనా!

చ. ధనువును శాతబాణములఁ దక్షణ మిచ్చిన నంతలోన నీ
వనిఁ గల క్రూరజంతువులఁ బ్రాణములం దగఁగొంచు మత్తవా
రణములఁ జెండ్లరీతిగఁ గరంబున బట్టియు నాటలాడెదన్
ఘను లగుమానివర్యుల సుఖస్థితి నుండఁగఁ జెసెదన్ ప్రియా.

రత్న — సింహపుఁబిల్ల చిన్నదైనను నైజపువృత్తిని జూపకపోదు గదా! ఈతఁడును వీరపితృపితామహసంబంధమైన కీర్తినె వహించును రాకుమార! నీ వెప్పుడును సాహసపు బనులకుఁ బోకుము.

చంద్ర—(తనలో) ఈమె యేమనునో యని వానిని దెచ్చి యిమ్మంటినికాని యీమె కట్టిసామర్థ్యము కలదా! (ప్రకాశము) ప్రియా! నీ వంతమాత్రమునసే భయపడుచుంటివి.

ఉ. మొన్న టిరేయి నిన్విడచి మోహ మెలర్చినచిత్తవృత్తితోఁ
బున్నమచంద్రకాంతులను బోల్చెదు నీవని కేళి ప్రాంతమం
దున్నమృగేంద్రయుగ్మము మహోన్నతిఁబట్టియువాటలాడియున్
గ్రన్నన వచ్చి నీవు వనుగానక యుండఁగ నిద్రపోయితిన్.

రత్న - (తనలో) ఈతఁ డిట్టిసాహసపుఁబను లొనరించిన నెప్పుడేమికీడు సంభవించునో? కొంచెము బెదరించెదను (ప్రకాశము) ఓరా కుమార! నాతోఁ జెప్పక నీయిచ్చ వచ్చినటుల సంచరించుచుంటివికాన నిది మొదలు నాతో మాటలాడకుము పొమ్ము (త్రోసివేయును.)

చంద్ర—ప్రియా! కోపము వచ్చినదా క్షమింపుము.

చ. కిలకిలలాడు నీనగుమొగంబు ప్రకోపముచేత గావిరం
బులఁ గదు నీనుచున్ ముడుచుకొన్నఁ గనుంగొని యెట్లు సైతు నీ
వరిగిన నన్నుఁ బ్రేమ చెలువారఁగ నెవ్వరు చూతురో సతీ
తిలకము! నీవు చెప్పెడుగతిఁ గుఱి తప్పక సంచరించెదన్.

రత్న—(తనలో) ఆహా యేమి నాభాగ్యము! నామనోహరుని పల్కులు శృంగారరసమును జిల్కుచున్నవి (ప్రకాశముగా) రాజపుత్రా! ఇంతటినుండి నాతోఁ జెప్పనిపనిఁ జేయనని బాసఁ జేయుము.

చంద్ర—(తనలో) ఈమె నాప్రభావ మెఱుంగక యిట్టులఁ బలుకుచున్నది. ఎట్లైన స్త్రీస్వభావము వృథాగాపోదు (ప్రకాశము) ప్రియా! అటులె చేసెదను (చేతిలోఁ జేయునిడును.)

రత్న—అట్లు నిశ్చయముగ నడువవలెను సుమి!

చంద్ర—నిశ్చయముకాక అనిశ్చయ మనునది యొకటికూడ కలదా! కాని మన కీయరణ్యావాస మేల కలిగినది?

రత్న—రాజపుత్ర! కొండొకకారణంబున నిన్నుఁ దోడ్కొని వచ్చితిని. ఇపుడుకదా! యీవిపదార్ణవము నుత్తరించుటకు నీవు నావ వైతివి! నిన్నుఁ దోడ్కొని యేదేనిపట్టణమునకుఁ బోయి యచ్చటనొక గురువుచేత విద్యాభ్యాసముఁ జేయింపవలెను. పోవుదము నడువుము.

చంద్ర—ఔను లెస్సగా నాలోచించినావు. నాకును చదువుకొనుటకు నభిలాష కలుగుచున్నది వేగనడువు మిపుడే పోవుదము. ఓరీశబరకుమార! నేను తిరిగి కొద్దిరోజులలో నిన్నుఁ గలసెదను.

రత్న—అటులైన నే ధన్యాత్మనే మంచిది నడువుము ఓవనబాలకా! నీకుటీరమునకుఁ బొమ్ము.

వనబా—అమ్మా! చిత్తము.

(అందరు నిష్క్రమింతురు.)

రంగము శోణపుర వీధి చదువులబడి.

[బడిపంతులు ప్రవేశించును]

పంతు — ఉస్, అబ్బా! శ్రీరామరామా! ముసలితనము చేత నడుము వంగిపోయినది, ఈచదువులబడి చెప్పుటకు ప్రతిదినమును పోవకతప్ప దు. పోతున్న తో నాభార్యకు చేయి యూడడమే కాకుండా నా కుపవాస ఫలములుకూడా సంభవించును. ఇంతకు నీదారిద్ర్యమును వేనుకొని వివ్వాయముగాఁ దెచ్చికొన్నాను.

సీ. పూర్వార్జితము లైనభూములఁ బోగాల
 వెలువలో మంచివేసినాఁడ
పెద్ద లార్జించినవి త్తంబు జూదరి
 తనకూడి గంగలోఁ గలిపినాఁడ
నిల్లాలివస్తువు లెల్ల ద్రాగుబోతున్నై
 వెచ్చించి పెనుమంటఁ బెట్టినాఁడ
మేకల దెగనమ్మి కోడెకాంత్రమను ని
 చ్చిము శుద్ధమోటుమ్ముఁ జేసినాఁడ
ఇది సహింపక భార్యనూత దిగిచావ
బంధ మెకలె నను మ పంభ్రపకిసవాఁడ
నత దాంత్రికు లనుచెంచి యబల నొకతెఁ
గూర్చి నాగొంతుఁ బరబరఁ గోసినాఁడు

రెండవభార్య నెత్తిమీఁదఁ గుంపటివలె దాపరించుట చేతఁ బడరానికష్టములపా లగుచున్నాఁడను. పిల్ల నిచ్చినవెధవకు సంధానముఁ జేసినపెండ్లి పెద్దవెధవలకు చేసుకున్ననాకును సిగ్గులేదు అరువదియేండ్ల వెధవకు నాకు పెండ్లి యేమిటి! మధ్య తాంత్రికుల కేమి! పోగామిగిలిన మాంత్రా మహార్జితపు కొంపయుండఁగాఁ దెగనమ్మించి లంచములక్రింద వేయిరూప్యములు మ్రింగినారు. పిల్లదానితండ్రి వేయిరూపాయిలు తిన్నాఁడు,

మధ్య నీకష్టములు పడలేక నేను చచ్చిపోవుచున్నాను నాబాల్యమున నాలుగుసంస్కృతముక్కలు చెప్పించుటచే నే నెటులుమదోన్మత్తతచేఁ దిరిగినను నాచదువే చివరకు నాకు జీవనము నిచ్చుచున్నది. అందువల ననే నాయం దందరికిని గౌరవాభిప్రాయము కలదు విద్యాధనమునకు సాటిలేదుకదా చిన్ననాఁటి యీచదువు లేకపోయిన నాబ్రతుకు కుక్కలకేగాని మఱెందుకును గాదు. అయినను ముసలివాఁడనని యీపిల్లలు నన్నాడించుచుందురు ఆబాధ నాకు విస్త్రాణము కలుగుచున్నది ఇంతకు దైవవిధి కేమి చేయఁదగును? ఈయల్లరికుంకలతో వేగలేక చచ్చిపోవుచున్నాను

సీ. కూరుచుండెడు చాపకును క్రింద దళముగాఁ
బల్లేరుకాయలఁ బరచువారు
నడుము లాగఁగఁ జేరఁబడవలె నన్నచో
గోడకు సూదులు గ్రుచ్చువారు
కుడిచినమత్తుచేఁ గునికినఁబోఁ బిల్ల
జుట్టుఁ ద్రాటను బైకిఁ గట్టువారు
అల్లరికుంకల నదలింప లేవఁగా
వెనుకగోచిని లాగివేయువారు
గీ. యమపురిని బాధలను బడవచ్చునుగాని
చదువుఁబరుల గురుత్వంబు సలుపలేము
వేయిమేకలఁ గాయఁగా వీలుపడును
గాని పదిమందిపిల్లలఁ గాయలేము

అరుగో! అరుగో! కొండముచ్చులవలెఁ గోచితోఁకల వ్రేలవైచికొని ప్రభాతకాలపుఁ దూష్పరేఖలవలె మొగమున విభూతిరేఖలఁ బెట్టుకొని యొకనిజుట్టొకఁడు లాగికొనుచుఁ దన్నికొనుచుఁ బిల్లలదే వచ్చుచున్నారు.

[అంతట యుద్ధోక్తముగాఁ బిల్లలు ప్రవేశించుచున్నారు.]

పంతు — ఓరోరి భ్రష్టులార ! అల్లరిఁ జేయకుఁడి. చెడిపోతారు! కండి కొట్టుచుండుఁడు.

1 పిల్లవాడు—పంతులుగారండి నూతుండి మాతుండి (మరి యొకనిని చూచి) చెప్పనా !

2 పిల్ల —చెప్పవద్దు నీకు పలకపుల్ల యిస్తాను.

1 పిల్ల—అబ్బా ! అది నా కెందుకు? వాళ్లదొడ్లో నీవు దొంగిలించుకొనివచ్చిన నారింజకాయలలో రెండుకాయలు ఇస్తే—

2 పిల్ల —ఒక టిస్తాను చెప్పకుము (యిచ్చును)

పంతు — ఓరీ ! ముకుందిగా మొద్దబ్బాయి వచ్చినాడటర !

3 పిల్ల—రాలేదండి గోశీబిల్లాడుచున్నాఁడండి.

పంతు—వేగ పోయి వాని నీడ్చుకొనిరండు.

1 పిల్ల - పంతులుగారండి నేనుకూడా వెళ్లనా అండి.

పంతు—పొమ్ము కామిగాడేడిరా!

1,3 పిల్లలు—(నిష్క్రమించుచున్నారు.)

2 పిల్ల—కామిగాడు కామిగాడై నాడండి పెండ్లి అయినదండి మనుగుడుస్తున్నాడండి. అరుగోనండి మొద్దబ్బాయిని లాగుకొని వస్తున్నారు. (తెరలోరోదనము)

[అంతట మొద్దబ్బాయి నిద్దఱుపిల్లలు లాగి తెత్తురు ]

పంతు — ఏమిరా ! అల్లరి యూరకుండుము. (కొట్టును)

మొద్ద —(ఏడుస్తూ బెల్లమును తినుచునే యుండును).

పంతు—(కొట్టుచునే యుండును.)

మొద్ద — పంతులు, పంతులు పంతులూరుండి మూరుండి మూరుండి మాఅమ్మండి యీనాడాకోనుండి ఒడ్లొండి అరబోసిందండి నాకుండి బెల్లం పెట్టుండి కాపుందుమందుండి అ, అ, పాళంగానుండి యీనాదన

లంపి ననాలాగుకొచ్చారండి నాకు జ్వరం వచ్చిందండి నావొళ్లు వేడిగా వుందుండి చూడండి డోక్కున్నానండి (నోటిలో వేళ్లుపెట్టుకొని తిరిగి డోకుట నభినయించి) అమ్మయ్యో చచ్చిపోతానండి చెల్లిపోతానండి వళ్లు దూడలు తింటాయుండి మాఅమ్మవని యీపాటికయి బైటకొచ్చి నూత్తుం దండి నన్ను చంపుతుందండి అయ్యో బాబో బాబో నాకు కడుపునొప్పి యెత్తుకుందుండి యిక చచ్చిపోతానండి యిడిసిపెట్టండి మారాజా మీాకు దండా లెడతానండి. మీాకండి యింతపొడుగు మొక్క జొన్నపొత్తి యెత్తుకొచ్చియిస్తాను నన్ను చంపకండి (యేడ్చును)

పంతు — ఓరి టక్కరివెధవ! నిన్ను నేవదల నూఱకొనుము.

1 పిల్ల — అరుగోనుండి రాచకొమరుఁడును మంత్రిసూనుఁడును వచ్చుచున్నారు.

పంతు — రానిమ్ము అల్లరి చేయకుఁడు.

[అంతట రాజకుమారుని మంత్రికుమారులు ప్రవేశింతురు.]

పంతు — ఏమండి యువరాజుగారు! దయచేయుఁడు మీా కిరవు రకుఁ బాఠములు వచ్చినవికదా!

రాకుమా — రా లేదండి.

మంత్రికుమా — ఇపుడు చదివెదమండి. (పుస్తకముల దెఱచు చున్నారు.)

పంతు — ఆటులే కానిండు ఓరీ మీామీా పాఠముల నప్పగింపుఁడు.

1 పిల్ల — తస్మిన్నద్రొకతిచి కబలా విప్రాయుక్త వ్సకావిా

[అంతట చంద్రకాంతునితో రత్నమాల ప్రవేశించి]

రత్న — మహాత్మా! నమస్కారము.

పంతు — అమ్మా! సౌభాగ్యవతీ భవ నీ వెవ్వతెవు?

రాకుమా & మంత్రికుమా — (ఇరువురును మోహితులై చూచు చున్నారు)

రత్న — స్వామి! మీము క్షత్రియాన్వయసంజాతులము విధివశ[illegible] బంధువుల విడఁబాసి వనములఁ గ్రుమ్మరుచు నేఁటి కిచటి కరుదెం[illegible] కొలాహలించి యీరాకుమారునకు విద్యల గఱపుటకు వేఁడుచున్న[illegible].

వంశ — అమ్మా! ఏ బలే చెప్పెద నంతవరకును నీవు మాయింటనే యుండవచ్చును.

రత్న — తండ్రీ! అటులె కావించెదను రాకుమారా! వీరియొద్దఁ జదువుకొని వీరితోనె గృహమునకు రమ్ము (నిష్క్రమించును)

చంద్ర — మంచిది.

రాజకుమా — (జనాంతికముగా మంత్రికుమారునితో) ఓయి చెలికాఁడ! ఈనవమోహనాంగిలావణ్యమును జూచితివా! మూఁడులోకములను ముంచివేయుచున్నది!

మంత్రి — ఎట్టిసౌందర్యవతియైన నేమి? నీకౌఁగిటఁ జిక్కకుండునా? నీ కింత యుబ్బుర మేల?

రాకు — నీవు కుశాగ్రబుద్ధి కలవాఁడవు. నీనేర్పువలనఁగదా! నే నట్టివాఁడ నగుట; ఏదేని యుపాయ మాలోచించితివా?

మంత్రి — (జనాంతికముగా) ఆలోచన కేమియున్నది! వనవిహారవ్యాజమున నీబాలుని వనమునకుఁ దోడ్కొని సంహరించినచో నీనెలంత నీపాలఁబడక యెందుఁ బోఁగలదు!

రాకు — చక్కనియోచనఁ జేసితివి. ఇప్పుడే సెల వడుగుదము (ప్రకాశము) అయ్యా! గురువుగారు మే మీరోజుమొదలుకొని మధ్యాహ్నకాలముల వనవిహారములకుఁ బోవుదుము. క్షత్రియుల కర్తవ్యకృత్యములు కదా! గనుక మాతో నీచంద్రకాంతుఁడుకూడ క్షత్రియవ్యాపారమునకు రాఁగలఁడు.

పంతు—అయ్యా! తమచిత్తమువచ్చినటుల పొందు చంద్రకాంతుఁడు వచ్చుట కాదాయము చాలదు.

మంత్రి—(చంద్రకాంతుని గోకి జనాంతికముగా) నీవుకూడ సెల వడుగుము.

చంద్ర—గురువర్యా! నేను చిరుతవాఁడ నైనను నాకు జంతు భయములేదు కావున నాకుఁగూడ వనవిహారమునకు సెలవిండు.

పంతు—రేపటిమాటల నాలోచింతేము. ఈరోజునకు వేళయతిక్రమించినది. రండు పోవుదము. భయము లేదనగానే సరియా! క్రూర జంతుబాధల కెంతటివారైన జడియవలసినదే, పోవుదమురండు.

(అందరు నిష్క్రమింతురు.)





# చంద్రకాంతనాటకము

## సప్తమాంకము.

రంగము— అరణ్యము.

[చంద్రకాంతునితో రాజకుమారమంత్రికుమారులు ప్రవేశింతురు]

రాజ (జనాంతికముగా మంత్రిసుతునితో) ఓయి మంత్రి! మనస్తోషకార్యము నిచట నిర్వర్తించుకొందమా యింకా ఘోరారణ్యమునకుఁ బోవుదమా?

మంత్రి — మన మెక్కడ నేమి తలఁచుకొనినను సానుకూలమై పడును.

రాజ — అటులైనఁ గానిమ్ము.

మంత్రి — ఓచంద్రకాంతా! ఈయరణ్యమునఁ గలచిత్రములను జూచితివా?

చంద్ర — నే నెపుడు చూచినాను? చూపుఁడు.

రాజకు — ఓరీ! ముందు దీనిని జూడుము.

చ. ఇది యొకపెద్దమఱ్ఱిగను మిచ్చట భూతపిశాచరాక్షసుల్
ముదమును జెందుచుండెడియు నమోఘముగా నివసించుచుండ్రు వీ
తదయఁ దలారులు గ్రమముగఁ దస్కరులన్ వధియించుచోటిదే
పదపడి చూడు రక్తమయవధ్యశిలన్ నృకపాలయుక్తముల్.

చంద్ర శివశివా! యిట్టిపాపప్రదేశమును నా కెందులకుఁ జూపించితిరి.

మంత్రి—నీకుఁ జూపవలసిన దిదియేకదా!

చంద్ర—ఏమికారణమున దీనిఁ జూపవలెను?

రాజ—నిన్ను నీశిలాసింహాసనమున నధిష్ఠింపఁ జేసి స్వారాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ జేసెదము

చంద్ర—(తనలో) పట్టాభిషేక మనుటచే మంగళప్రశంసయే కాని వధ్యశిలనధిష్ఠింపఁ జేయుట ఘోరకృత్యముగాఁ దోఁచుచున్నది. (ప్రకాశముగా) మిత్రులారా! పరిహాసమునందైన నమంగళప్రశంస మనుచితమని మనము చదువుకొనినపాఠమున లేదా? మీ రేల యిట్టి కఠినోక్తు లాడెదరు?

మంత్రి—కఠినోక్తులె కావు. ఖడ్గమును కంఠమునకు భూషణముగాఁ జేసెదము.

చంద్ర—అన్నలార! నిష్కారణము నాపై నింతచలముఁ బూనెద రేల?

రాజ—కారణముతో నిమిత్తములేదు. వేవేగ శిల నెక్కుము. నిన్నిదె చంపెదను.

చంద్ర—ఓసోదరులార! నన్నుఁ జంపిన మీ కేమిలాభము?

రాజ—మీరత్నమాలను మే మనుభవించుటకొఱకు.

చంద్ర—హాహరీ! (చెవులు మూసికొని)ఓమిత్రులార!తుచ్ఛము లైనప్రాణముల కేమిగాని పరవనితారతంబు బహుపాపమని యెఱింగియు నిట్టినీచకృత్యములకు సిద్ధపడెద రేల?

మంత్రి—ఓరీ నీవు మాకు నీతులు చెప్పఁ బనిలేదు వధ్యశిలపై నిలువుము.

(కత్తి నెత్తుచున్నాఁడు.)

చంద్ర — అన్నలార మీకు వంచనము లొసరించుచున్నవాఁడను.

గీ. బాలకుండ నాదుప్రాణముల్ రక్షించి
పుణ్యమార్గమునకుఁ బోవరయ్య
రాజనందనులకు రాజధర్మమె యిది?
నన్నుఁ జంపఁబోకుఁ డన్నలార!

రాజ — ఓరీ! నీబతిమాలుట లేక మానుము నిన్ను నిశ్చయముగ యమున కర్పించెదము.

చంద్ర — అన్నలార!

గీ. నన్నుఁ గానక మాయమ్మ యెన్నరాని
దుఃఖవారిధిలోఁ బడి దొరలుచుండు
నామె ఖేదము వాపఁగ నఱుఁగువాఁడఁ
గడుదయాహృదయంబున విడుచరయ్య

మంత్రి — ఓరీ మీయమ్మకు సంతోషము మేము చేయవలెఁగాని నీ వేమి చేయఁగలవురా! ఛీ నిలువుము (కత్తి నెత్తును)

చంద్ర — అయ్యో దైవము!

గీ. ఇఁకఁ గసాగను నా దేహవల్లి యిప్పు
గాలిచే దూలులకు నోరణి నకట!
నోటఁ దడిలేక యొకైన మాటరాక
యున్న నన్ జంపఁ జెల్లునో యన్నలార.

రాజ — ఓరీ నీ వెంత యేడ్చినను నీయెడ మాకుఁ గనికరము పుట్టదు.

చంద్ర — అన్నలార!

గీ. కటికివాఁడైన జీవము గలమృగముల
... శేయాడ కితరులు చంపి తెచ్చి

ప ష్టమాంకము//

నట్టివానిని గొని విక్రయమున బెట్ట
గటకటా! మీకు నాయెడఁ గరుణ లేదే.

మంత్రి — ఓసీ తులువ! నీధర్మములతో మాకుఁ బనిలేదు.

చంద్ర—అట్లైన మాయమ్మ నొకసారి చూచి రానిండు.

రాజ—ఛీ నిలుము నిన్ను విడచువారము కాము.

చంద్ర—(తనలో) అయ్యో! దైవము! ఈయమకింకరుల చేతి లోఁ జిక్కినాఁడ వీరి వెత బ్రతిమాలుకొనినను వ్యర్థమయ్యె నింక నన్ను రక్షించువా రెవ్వరు (ఆలోచించి)

చ. ఎవఁడు సృజించె నీజగతి నెవ్వఁడు పాలన సేయుచుండె నిం
కెవఁడులయంబుఁ జేయుమఱి యెవ్వఁడు కాలముఁ దెల్పుచుండు నిం
కెవఁడు భవాబ్ధి ముంచి వెలయించును జీవుల నట్టిబ్రహ్మ నా
కవనుఁడు కాక నేఱెకలఁడా? (ఆలోచించి) మఱి యేరును లేరు

[నా కిటన్.

కావున నాపరాత్పరునే ప్రార్థించెదను (ప్రకాశముగా) అన్నలార! అటు లైన మృత్యువునోట బడనున్న న న్నొకసారి యనుగ్రహించి భగవం తునిఁ బ్రార్థనమును జేసికొననిండు

రాజ— అట్లే చేసికొనుము

చంద్ర—

చ సరసిజనాథ యాశ్రితవశంకరమానిహృదాబ్జవాస భా
సురతరకీర్తిసంకలిత శోభితకాస్తుభ భూమదైత్యసం
హారణ ఖగేంద్రవాహాసమయం బరుదెంచెను బ్రోవు మయ్యా నీ
గురుచరణారవిందములె కొల్చుచు నుంటిఁ గదేరమాధవా.

[అంతటఁ దెరలో నశరీరవాణి.]

ఓచంద్రకాంత! నీభక్తికి మెచ్చితి, నింతటనుండి నావరప్రభావంబునమహా బలసంపన్నుండవై దుష్టశిక్షణశిష్టరక్షణమును జేయుచుఁ గీర్తికాముఁడవై

ప్రబలుదువుగాక జృంభకాస్త్రములును వానియంతట నవియే నీకుఁ బ్రసన్నము లగును. ఈఖడ్గబాణబాణాసనముల గొని యీదుష్టులఁ గీటడంగించుము (పైనుండి ఆయుధములు పడును.)

చంద్ర—ఆహా! మదీయభాగ్య మే మందును (ఆయుధములకు నమస్కరించి కైకొని) పరమేశ్వరుఁడు కరుణాళుండై వరం బొసంగినాఁడు వీనిని స్పృశింపఁగనే నా కధికబలధైర్యము లొదవుచున్నవి. ఇంక నా కెందును కొఱంత లేదు. (ప్రకాశముగ) ఓరోరి దుష్టులార! పతివ్రతామానభంగకారకులార! ఓబాలహంతకులార! ఇప్పు డెందు పోయెదరు ?

ఉ దండిగ మత్పితాశివిబుధప్రకరంబులు మెచ్చ మిమ్ము నా
చండతరక్రుధాగ్నిశిఖసత్ప్రథ మెల్లను నిండఁ ద్వద్భుజా
దండముల న్శిరంబు నతిదారుణవృత్తిఁ జరించుచుండి నే
ఖండనఁ జేసి సాధులకుఁ గల్గఁగఁ జేయుదు సౌఖ్య మిత్తతిన్.

రాజకు—ఓమంత్రికుమార! తొండముదిరి యూసరవెల్లి యైనటుల భీరువు భీమబలుఁ డైనవాఁడు.

మంత్రి—అంతమాత్రమునకె భయపడెద వేల?

చంద్ర—ఓదుష్టులార! మీకు భయ మేల? మిమ్ములఁ జంపి భూమి నిష్కంటకముగాఁ జేసెదను.

రాజ—మంత్రికుమార! మన మొకవేళ యితనిని విడిచినను ఇతఁడుమాత్రము మనలఁ బ్రాణములతో విడువఁడు. భగవత్కృపాపూర్ణుఁడైన యీతని కేది దుస్సాధ్యము? కావున మన మోపినంతవఱ కితనితోఁ బోరవలయును.

మంత్రి—ఓ! నిస్సంశయముగ యుద్ధము జేసి నే నీతని నోర్చెదఁ జూడుము.

చంద్ర—ఓక్రతాగబోతులార! మీ దురాలోచనములు నేటితో సరి. మిమ్మెల్ల నా హేతికి బలి యిచ్చెదను.

రాజ—ఓరీ! యూరకున్న కొలఁది మీఱుచున్నావు.

గీ. మిడుతవలె నూటినూటికి మిడిసిపడకు
మిదిగొ నాహేతిపాల్ చేసి మద మణంతు
బయలపల్కుల కింత గర్వం బదేల?
ఇల్లలికినంతఁ బండుగ యెట్టు లగును?

చంద్ర—ఓస్వప్రాణభంగ హేతుభూతులార! ఓక్రూరులార!

చ. ఖలులై నన్ను వధించి మజ్జనని వీకన్ బట్టఁగాఁ గోరు మీ
తలపుల్ నేఁ డిదె పండె సాధుజనసంతాపం బు మీపట్ల ని
ష్ఫలమె! దుష్టచరిత్రులార! నిజవంశచ్ఛేదులారా గతా
సులరై యీశరకాంతఁ గూడిసుఖమున్ సొంపొందగాఁబొండుఁడీ

మంత్రి—ఓరీ డింభక! నీయాటోమిక చాలింపుము.

క. వటవట ప్రేలగబోకుము
దిటముగ యుద్ధమున నిల్వ ధీరత మెఱయన్
బటుబాణానలమునఁ గా
ల్చుట సిద్ధము నిన్ను నిపుడె చూచుచునుండన్.

చంద్ర—ఓనిజాన్వవాయకాననకుఠారులార.

చ. విలయవలాహకోద్భవవిభీషణనిస్వనముల్ చెలంగఁగా
జ్వలనుఁ దుదగ్రతన్ ప్రభల సత్పథ మెల్లను గప్పురీతి భూ
తలమదృవన్ శరాగ్నిశిఖదగ్ధులఁ జేసెదఁ బోర నిల్వ మో
ఖలుఁడ! వృథాప్రలాపములఁ గర్వముఁ జెందుట వీరకృత్యమే?

రాజ—ఓరీ నీవ నిన్ను మెచ్చుకొనుట యుక్తము కాదు.

గీ. బీరములు పల్కుమాత్రన బిరుదు కాదు
చేయఁ జాలినపని యెల్లఁ జేసి చూపు

టుచితమా గాని వ్యర్థంపు టుక్తు లేల?
నిలువుముర కుబ్జ! చేతితో నలిపివైతు.

చంద్ర—ఓవాచాటలార!

ఉ. బాలురఁ జంపుటో? యితరభామలఁ బట్టుటో? చోరకృత్యముల్
చాలఁగఁ జేయుటో? విబుధసంతతి దూఱుటో? యెంచ ధైర్యవా
చాలతఁ జూపఁగా నెయది తోత్రమొ? భీకరశస్త్రజాల మా
భీలముగా మెయిన్ బొదువ వీరత నిల్చినవాఁడె శూరుఁడౌ.

మంత్రి—నిజమునిజము కాని యుద్ధమున నీకినుమంతయుఁ దెలియదు సుమ

గీ. కందుకపుఁగేళికా దిది కఠినబాణ
పాతములు మేను తూట్లుబడు నిజముగ
వాని రుచిఁ జూడకయె వృథా వదరుచుంటి
విదిగొ చూపింతుఁ జవిఁ జూడు మిపుడె వాని.

చంద్ర—ఓదుష్టులార! అటులైన మీ శిలీముఖంబుల రుచిఁ జూపింతురు గాని రండు. (కత్తిని ఝళిపించి)

క. ఖలులార! మిమ్ముఁ బొరిగొని
యిల భారము మాన్పుటకు నహీన ముదమునన్
జెలఁగుచు నీహేతియు నీ
కలనికిఁ బొల్పడు మటంచుఁ గ్రక్కున గదలెన్.

ఓక్రముక్కుడులార! నే విడచినను నాశస్త్రముమాత్రము మిమ్ముల విడచునది కాదు. ఓశస్త్రపీతంసమ!

గీ ఖడ్గమా దుష్టరక్తావగాహనమున
కోర్వలే దని యోజించుచుంటి గాని
వేడుకా దిదె చూడుము ఘోరమైన
బవరమున వీరితలలను భువిని గూల్తు.

రాజ—ఓరీ! పలుపోక లేల పోయెదవు? యుద్ధమున నిలువుము.

చంద్ర—ఓరీ సమర మొనర్చుటకు వృతశూన్యంబైన యీని ర్మలతలంబున కరుగుదము రమ్ము.

రాజ—అటులే రమ్ము.

మంత్రి—రాకుమార! యీతఁడు నన్ను జంపినపిమ్మటగదా మీరు యుద్ధ మొనర్చుట కావున నీవిట నిలచి మాయుద్ధనిపుణతను జక్కఁగఁ గనుచుండుము.

రాజ—అటులైన గానిండు

చంద్ర & మంత్రి—(నిష్క్రమింతురు)

రాజకు—అబ్బబ్బా! యేమి యీతని ప్రతాపము సమరారంభ ముననే మామంత్రిసూనుని—అయ్యో సంహరించినాఁడు నాచెలికాఁడు పోయినపిమ్మట నేనేనా యీతుచ్ఛపుఁబ్రాణముల కాశించి బ్రతుకు వాఁడను. (నిష్క్రమించును)

చంద్ర—(ప్రవేశించి) శివశివా! వీరిద్దరు మదీయఖడ్గమునకు బలియయినారు. ఆహా! జారత్వమునకుఁ బోవువారిపాట్లివియేకదా.

[తెరలో]

హారాకుమార! హాసుగుణైకనిధీ! ఆదుష్టులచే నెంతబాధఁ జెందుచుంటివో కదా!

చంద్ర—ఈయార్తరవము మాతల్లిదిగా దోచుచున్నయది ఒకవేళ నన్నన్వేషించుచు నీవనములకు వచ్చెనని తలంచెదను నేనామెను దెలిసికొని యామెయూరట మాన్పెదను

(యొకచెట్టుచాటునకుఁ బోవును.)

శత్రు—(ప్రవేశించి) హా! నవమోహనాకార! ఎన్నిచోట్ల వెతకినను నీపొడ గానరాకున్నది. నే నేమి సేయుదు నెందుఁ జొత్తును.

గీ. క్రూరబుద్ధులు నిను బట్టి ఘోరమైన
యడవికిని దోడుకొనిపోయి హత మొనర్ప
బూన కారణ మేలొకో పూర్ణచంద్ర
వదన! వారల కేమిచే టొదవె నకట!

(మఱియొక చెట్టుచాటునకుఁ బోవును.)

చంద్ర—(భూమిపైఁజూచి) ఆమె మాయమ్మ. పదచిహ్నము లగపడుచున్నవి. ఆమెకంఠరవము వినవచ్చుటయేగాని వృక్షముల సందున నామెదర్శనమి కను లభింపకున్నది

గీ నన్ను రోయఁగ బూని నీ వెన్నరాని
బన్నముల వడుచుంటివే వనములందు
నన్నుఁ జంపఁగఁ గోరి వనంబులకును
దెచ్చినారని నీ కేరు తెలిపి రొక్కొ!

హా!జననీ' మదర్థసకలకష్టభాజీ! (చెట్టుచాటునకుఁ బోవును)

రత్న—అక్కట! యెంత వెతకినను కానరాకున్నవాఁడు. అల్లదె యావక్కని రెండుమృతకళేబరము లగపడుచున్నవి. వారిమరణమునకుఁ గారణ మగపడదు.ఒక వేళ వీరే మారాజసుతుఁ జంప యత్నించినవారు కారుకద! వీరిదౌర్జన్యమునకు సహింపక యెవరో మహానుభావులు వీరిని సంహరించియుండనోపు అతఁడు నాకంట బడువఱకు నాహృదయము తామరపాకులోని నీటిబిందువువలె తత్తరించుచున్నది. ఓప్రాణనాథ!

ఆ. ఓమహానుభావ! యోపుణ్యపూరుష!
శత్రుయుగము మాపి చంద్రకాంతుఁ
గాచి హాని నాదుకనులకుఁ జూప వేఁ
కెట్లు సైతుఁ బోవుమీ! కృపాళు.

హా! రాజకేసరికిశోరమ! నీయుల్లాసరూప మొకసారి నాకుఁ జూపి నా పరితాపమును తొలంగింపవా! (వేఱుచోటునకుఁ బోవును)

చంద్ర—(ప్రవేశించి) హాతల్లీ! నీకంఠరవము వినవచ్చుటయే కాని నీదర్శనము లభించుటలేదు. నాకొఱకై యెన్నికష్టములు పడు చుంటివో కదా!

ఉ. కంటికి రెప్పవోలె నను గాచుచునుండి సతంబు నేను రా
కుంటకుఁ గారణం బెఱిఁగి యోర్వఁగఁజాలక నన్ను రోయుఁగా
నొంటిమెయిన్ భయాటవుల నోడక యేగు మదీయమాత మీ
కంటను బడ్డచోఁ జెపుడు కాననవృక్షములార కూర్మిచే.

అయ్యో! ఈవృక్షములలో నొకటియు మాటలాడ దయ్యె. అల్లదె యామామిడి యొకకోకిల కో, యనుచున్నది. ఓకోకిలా! నీవెవ్వఁడ నని యా యడుగుచున్నావు? నేను చంద్రకాంతుఁడను.

క. పరభృతమా! ఈవనములఁ
దిరిగెడు నామాతవార్త తెలిసినచో నన్
గరుణించి చెప్పి పోవుము
గురుకీర్తిని భూమిలోనఁ గొరలెదువిన్నా.

ఇదియును మాటలాడ దయ్యె

సీ. సతతంబు నను బ్రోచు జనని మీకన్నులఁ
బడిన జెప్పుడు చక్రవాకులార
ప్రేమచేతను నన్నుఁ బెంచిన మాయమ్మఁ
గానరే యోసహకారులార
నిముసంబు ననుఁ బాయనేరని నామాతఁ
దిలకింపరే తిలకలతలార
వేళ కన్నముఁ బెట్టి లాలించు మాయమ్మఁ
జూడరే బర్హిణశుకములార.
మజ్జనని నన్నుఁ గూర్పుఁడో మావులార
కరుణఁ జూపుఁడు నన్నశోకంబులార

జాగు సేయక ప్రోవు డో జాములార
పగను సాధింపఁ దగునె యోయుగములార.

హామాతా! (అనిమూర్ఛిల్లును)

రత్న—హా! రాజకేసరికిశోరమ! హాప్రాణనాయక! నీవెప్పుడో నవవయస్కుండవై నామోహముఁ దీర్చెద వని పేరాశచే నున్న నా యాశాలతికను ద్రెంచివేయుఁబూని నాకుఁ దర్శన మీయకుంటివా? ఆ దుర్మార్గులనుండి రక్షింపఁబడుటయు నాకుఁ గనంబడకుండుటయు సంతోషఖేదంబులు రెండును కలుగఁజేయుచున్నవి.

గీ. ఒక్కవైపు నీళ్లు మఱొక్కవైపుఁ
బాలు కల్గినచెక్కులు పరిఢవిల్ల
ముక్కుపచ్చలె యారని చక్కనయ్య
నిన్నుఁ బ్రోచిన సద్గుణనిధి యెవండొ?

హాశారదచంద్రసమానవదన చంద్రకాంతా! నీ కారాకుమారులతో వైర మేల కలిగె హా మాలద్దైవము! నన్నిఁకేఁ గష్టసముద్రమునుండి తొలంగింపవు కాఁబోలును.

సీ. చిన్నిమోమున నవ్వు చెంగలించెడువానిఁ
బొడఁగానరే మీరు పొన్నలార
కురుచలై యాకుముంగురులు కల్గిననాదు
పతినిఁ గానరే ద్విరేఫంబులార
ఆజానుబాహు నాయరవిందనేత్రుని
వీక్షించినారె యోపక్షులార
చక్కనౌ నడకచేఁ జరియించు నాభర్తఁ
గానరే యోకనకంబులార
నామనోహరుఁ గానరే వేములార
నాపతినిఁ జూడ్ప రారె కలాపులార

సదయులైన నన్నుఁ బ్రోవరే జాజులార
చలముఁ బూనఁగనేలొకో వెలగలార!

(నడచుచుండఁ జంద్రకాంతుఁడు కాళ్లకుఁ దాకఁగాఁ జూచి) ఆహా! యేమిది! నామనోనిధి యేలొకో పడియున్నవాఁడు! రాజకుమారా! (లేపి యెత్తుకొనును.)

చంద్ర—హా! ప్రియా! (గట్టిగఁ గౌఁగిలించుకొనును.)

రత్న—(తనలో) ఆహా! ఏమి నాభాగ్యము! (పైకి) రాజకుమారా! ఆదుర్మార్గులనుండి నిన్ను రక్షించినవా రెవ్వరు?

చంద్ర—నన్ను భగవంతుఁడే రక్షించినాఁడు.

రత్న—వారితో నీకు వైరమునకు గారణ మేమి?

చంద్ర—నీవే—

రత్న—అక్కటా! తెలిసినది. ఎంతటిదుర్మార్గులో కదా! పతివ్రతామానభంగమునకే కాక బాలహంతకులుగూడ సిద్ధపడినారుగా! తరువాత వారలను నీ వెట్లు సంహరింపఁ గలిగితివి.

చంద్ర—ఆదుష్టులు నన్నుఁ జంపెద మని చెప్పఁగా నే నెంతో బ్రతిమాలితిని. వారు వినకున్నంతలో నేను భగవంతునిఁ బ్రార్థింపఁ బ్రసన్నుండై యాయన శస్త్రాస్త్రముల నొసంగి వీరిని సంహరింపుమని యశరీరవాగ్రూపముతోఁ జెప్ప నేన ట్లొనర్చితిని.

రత్న—ఆహా! ఏమి నాభాగ్యము! నే నిప్పటికి గదా సనాథనైతిని. ప్రతాపవంతా! మన్మనఃకాంతా! చంద్రకాంతా! పరనారుల మానభంగము సేయువా రిట్లు చంపఁబడుదురని లోక మిపుడు స్పష్టముగఁ దెలిసికొనఁగలదు.

గీ. వారలను నీవు చంపినవార్తఁ దెలిసి
యాగ్రహమ్మున భూపతి యాహవమున
కోహటించునొ యేమొ యీయునికి మనకుఁ
దగ దిచటఁ బాసి వేగ పోవగవలయును.

చంద్ర— (తనలో) రామాయణ మంతయు విని రామునకు సీత యేమి కావలయు ననునటులు సర్వము విని యు నింకను బిరికితన మునే వహించుచున్నది ఓభీరురాల!

ఉ. ఈపురిపాలకుం డనఁగ నెంత నిలింపవిరోధు లెల్లరుఁ
గోపవిఘూర్ణులై యనికి గొబ్బున వచ్చినఁగాని నీకచే
భూపతు లెల్ల రొక్కమొగిఁ జోరున కాయితు లైనహేతిచేఁ
బాపెద వారిప్రాణముల వారక నే త్రుటిలోన నమ్మరో!

రత్న — కాంతుఁడా! నీ వంతటివాఁడ వేయగుదువు. నాయదృష్టవుఁ దినములు వచ్చినవికాని నాపేరు మఱచితివా?

చంద్ర—అమ్మా! కాదు కాదు ప్రియా! యనుమాట జ్ఞప్తి యున్నది కాని నన్ను కాంతుఁడా యని పిలిచెద వేల?

రత్న—నీవు నాకుఁ గాంతుఁడవు కనుక.

చంద్ర—కాదుకాదు! అటులు క్లుప్తముఁ జేసిన నపార్థమిచ్చును. కావున చంద్రకాంతుఁడా యని పిలువుము.

రత్న—ఆయపార్థ మేదో చెప్పుము,

చంద్ర—అనగా భర్తకుఁగూడ నర్థ మిచ్చును.

రత్న — కావుననే నే నటులు పిలుచుచుంటిని.

చంద్ర—ఎందువల్లను?

రత్న—భర్త వౌటచేతను.

చంద్ర—భర్తను!

రత్న— ఆ, అవును.

చంద్ర—(తనలో) ఏమిది! ఇది నాకుఁ దల్లి యనుకొంటిని కాని వేఱుగాఁ దలంపలేదు. నన్నుఁ బ్రియా యని పిలువుమన్నపుడు తల్లియుఁ బ్రియము కావున నటులు పిలిపించుకొనుచున్న దని యూహించితిని ఆహా! ఈకులట నన్నుఁ జిరుతతనంబునుండియుఁ బెంచి నాకు జవ్వన

మంతురింపఁగనే నన్ను మోహించి పతిఁగాఁ జేసికొనుతలంపునఁ గాఁ బోలును ఇటులఁ బిలిపించుకొనుచున్నది. ఓయవివేకినీ! పాపిష్ఠురాల! నీ వాంతకైనఁ దగుదువు.

గీ. చిన్నతనమునను౦డియు నన్నుఁ బెంచి
జనకుఁడనైన ననుఁ జూచి కొంగ్రొవ్వపట్టి
సుతుఁడు వీఁడని యెంచక మతిచలింపఁ
గలయఁ జూచితె నను దుష్టకఠినహృదయ !

ఓసీ! చండాలురాల! నాచేతఁ బ్రియా యని పిలిపించుకొనుచున్న నీనా లుక వేయిచీలికలుగాఁ జేసెదఁ జూడుము.

రత్న—రాకుమార! శాంతింపుము

చంద్ర—ఓహా! దీనిని సతిగాఁ జేసికొనుటకుఁ గాఁబోలును నేను శాంతివహించుట.

ఉ నందనుఁడైన దండ్రి యయిన న్నిజసోదరుఁడైనఁ గంటికిన్
సుందరు లట్లు కన్పడిన సొక్కుచు నుందురు దుష్టకామినీ
బృందము లాత్మలో విరహవేదన కోర్వలేక యక్కటా
నిందకు భీతిలేక కడునీతులఁ బల్కుచు నుందు రెంతయున్.

ఓసీ జారిణీ నీపట్ల నాకు శాంత మేల యొదవవలెను? అయినను కారణము చెప్పుము.

రత్న—ఆకారణమున్న దీపత్రికను జూడుఁడు (పత్రిక నిచ్చును)

చంద్ర—(చదివి చూచుకొని) ఓసీ పాపీ! నే నీపత్రికను నమ్మి నీకుఁ బతినయ్యెద ననుకొంటివా? కాను కాను. నీవంటిమాయలమారు లీపత్రికను గల్పించు టెంతపని? ఓసీ!

గీ నీవు సత్కులమునఁ బుట్టినావొ లేదొ
యిట్టిపలుకులు పలికెద వేమి పరువు
నాకరాసికి నిను బలి యిచ్చువాఁడ
నిదిగో యనహితవై యుండు మిపుడె నీవు.

(అని కత్తి నెత్తి) ఓసీ పుత్రకుండ బలిగాఁ గోరిన నిన్నీకత్తికి బలి యిచ్చువాఁడను (నలికబోవును)

రత్న—రాజకుమార! శాంతింపుము. శాంతింపుము. కారణ మరయక త్వరపడెద వేల?

చంద్ర—నీ వాడుదానవు కావా? కారణమున కేమి? యేదో యొక యల్లిక నల్లి సమర్థించెదవు అదేదో చూచెదను వేగఁ గారణము చెప్పుము.

రత్న—ఇది భగవంతుఁ డల్లినయల్లికగాని నే పన్నినది కాదు. ఈపత్రికయు నీశ్వరప్రకల్పితమే. నాదురదృష్టవశమున నిది మిథ్య యని మీకు దోచుచున్నయది. కాని యీపత్రిక సత్యమైనది. నేను పామర జనంబుకీతి పాపకార్యముల కొడిఁగట్టుదానను కాను. నామాటవిశ్వసించి నన్నేలుకొనుము.

చంద్ర—ఛీ! పశువా! దూరమున నుండుము నిన్నిపుడె వధించి లోకమునకు నీతిప్రదర్శనముఁజేసెదను ఓజీవకోటులార! చూచితిరికదా! ఈకాముకురాలిని ఇట్టిమాయలమారులవలలఁబోఁ బడి ఘోరనరకముల పాలు పడకుఁడు ఇపుడే మీమీజ్ఞానశక్తుల నుపయోగించుఁడు మము ఎట్టినీతిబాహ్యమైన సంభాషణ చేసినదో వింటిరికదా? నిజముగఁ దల్లి యనుకొంటినిగాని కులట యనుకొనలేదు ఇట్టిది నాకు సతియట! దీనికి నేను భర్తనట! ఆహాహా! ఎట్టిదారుణము! ఎట్టిభయంకరము ఈనుడులు మీకర్ణములగుండఁలోనికిఁ బ్రవేశించిమీహృదయములబగుల్చుటలేదా? మీమతులను మంట బెట్టుటలేదా? మీరేల యుపేక్షించుచున్నారు? కాదు! కాదు! నేనే దీనిని వధించి లోకమును నిర్దుష్టముగాఁ జేసెదను. (ఖడ్గము నెత్తి జుట్టుపట్టుకొనుచున్నాఁడు.)

రత్న—హా! శంకరా! భవదీయకృత్యమంతయు నన్నుఁ బొటి గొనుటకేనా? ఓరాకుమార! ఆయుష్మంతుఁడా! నీవు నన్ను నమ్మక

నన్నుఁ జంపఁ జూచుచున్నను నీయొక్క నీతిమార్గమునకు మిక్కిలి నంతోషించుచున్నదానను పడఁతులు న్యాయముననో యన్యాయమున నో పతులచేతఁ జచ్చుచున్నపుడు ధన్యలే యగుదురు. ఈతుచ్ఛము లైనప్రాణము లెప్పుడు పోయినను పోఁగలవుకాని యీసాక్షాత్కారాలు పుత్రికుని సంసర్గముఁ గోర నాతఁ డలిగి చంపినాఁడను నపయశము నాకుఁ జుట్టుకొనకుండ నాసర్వేశ్వరుం డనుగ్రహించి నిజముఁ దెలిపినచో నాయట్టిపుణ్యవతి లేదని గర్వపడెదను అదిగాక దూరదృష్టి లేక నిజ మరయకుండ నాప్రాణేశ్వరునకు స్త్రీహత్యాదోషము వచ్చు నని కుందుచున్నదాన. ఓకీనదయాపర ! దీని కంతకు నీవే కారణభూతుఁడవు. ఎట్టులైన నాపతికి నమ్మకముఁ బుట్టించి నన్నేలుకొనఁ బ్రార్థించుచున్నదాన

చంద్ర (తనలో) అబ్బా యెట్టి వివేకవంతురాలుగ మాటలాడుచున్నదో! ఎటులైన నీవిషయమున స్త్రీలమాటల నమ్మరాదు (పైకి) ఓసీ స్వైరవిహారిణీ! నీశ్రీరంగనీతుల నే నెఱుంగుదును. ఇఁక వృథా కల్పనలఁ జేయక యిట్టిదుర్గుణము లెన్నఁ డుదయింపకుండ నొకసారి భగవంతునిఁ బ్రార్థించుకొనుము. వేగ కానిమ్ము.

రత్న—శివశివా! యిట్టిచరిత్ర మెక్కడను లేదు. నాకీవిధముగఁ జావు వ్రాసి యున్నదికాఁబోలును. హా పరమేశ్వరా! హా జగద్రక్షకా! నీవు మామామగారు చంద్రచూడమహారాజునకు వరం బొసంగినందులకు ఫలము నన్నుఁ జంపుట కని తోఁచుచున్నది. ఈచరిత్రము నెఱుంగక నన్నుఁ జంపనున్న నీవరప్రసాదిని వారించి నన్ను రక్షింపుము.

[ఆకాశమున]

ఓచంద్రకాంతుఁడా! శాంతింపుము! శాంతింపుము ఇది శంకర మగుటచేఁ బసిబాలుఁడవైన నీకీయెలనాగను బెండ్లి చేసినమాట యథార్థము ఈలేమ పార్వతీయంశమునఁ బుట్టిన మహామాత నీ వీశ్వరాంశోద్భవుండవు విూ కిరవురకుఁ గొండొకకారణమున భువి నవతరించుట గలిగినది.

కావున నీవె నీయర్థాంగిఁ జేపట్టి సుఖంబున నుండుము. సాహసింపకుము.

చంద్ర — మహాత్మా! ధన్యోస్మి! ఆహాహా! ఏమి నాభాగ్యము. నేను మందమతినై ప్రాణేశ్వరిని నిష్కారణముగఁ జంపుకొందునే! (పైకి) ఓప్రాణేశ్వరీ! ఎఱుఁగక చేసిన నాతప్పు మన్నింపుము (అని మ్రొక్కఁబోవును.)

రత్న — (త్రోసివైచును. లోనికిఁ బోఁ బోవును.)

చంద్ర — ఓహో నాప్రియకుఁ గోపము వచ్చినది కాఁబోలును. చెలీ నేను నీకు దాసుఁడను ప్రసన్నవుకమ్ము.

రత్న — ఓయి! దూరమున నిలిచి మాటలాడుము.

చ. కులటను నేను పాప మొనగూర్చును నాయెడఁ జెల్మిఁ జేయ నా
వలకుఁ దొలంగు మోయి నరపాలకుమారక! నన్ను నీవు నీ
చెలి యని చెప్పుకొన్నఁ గడుసి గ్గగుఁ గావున నన్నుఁ జంపి భూ
తలమును జక్కఁ జేయఁదగుఁ దాల్పుము ఖడ్గము వేగ వీరుఁడా.

చంద్ర ప్రేయసీ! ఇంతవఱకు నే నెఱింగి చేసినది కాదు. నన్ను మన్నింపుము. అదికాక నేను నీకోపమునకుఁ దగను సుమి!

ఉ. కోపముచేతఁ గన్బొమలు కుంచితభావము లొటఁ గాంచి, భ్రూ
చాపుఁడు మారుఁ డొట నదె సందుగఁ గైకొని వాడిచూపులన్
తూపులఁ గూర్చి నాతనువు తూటులు వ్రొవగఁ జేయు నందుచే
నోపఁగఁజాల కోపమున కోతరలాక్షి యనుగ్రహింపవే.

రత్న - ఓచంద్రకాంత! నీయనుగ్రహమునకు నేను దగినదానను కాను.

ఉ. మాయలమారికాంతను సుమా! చెడిపోయెదు చెంత రాకుమీ
వేయఖిలాంగనామణుల నెల్లరఁ జంపి యసత్య మిద్ధరన్

బాయఁగఁ జేయ ఫ్రాయి మగవారలుమాత్రమె యాడువారిదా
యాయువుకూడఁ బోసికొని హాయిగ నుండుఁడు సత్యవంతులై.

చంద్ర—ప్రాణేశ్వరీ! నాయపరాధము నీవే మన్నింపకున్న నిం
కెవరు మన్నింతురు?

చ. నిజ మెఱుఁగంగఁ గోరి తరుణీ యటువాదముఁ జేసినాఁడ నీ
గజిబిజి యేల కాంచనము కర్షణచేఁ గదె వన్నె గాంచు నీ
భజనమె గాక నీపతికిఁ బ్రాణపదం బిఁక వేఱె యున్నదే
రజనికరాస్య! మించిన విరాళికి నోర్వఁగఁ జాలఁ బ్రోవవే.

రత్న—ఔనౌను! మగవారలసంగతి నే నెఱుంగక పోలేదు.

మ. తమకార్యమ్మగునంతకున్ సతులచిత్తంబుల్ కలంగింపఁగా
నమృతప్రాయము లైనపల్కుల నుపన్యాసంబు గావించి సం
భ్రమమున్ పుట్టఁగ జేసి వారల సుహృద్భావంబు గన్నంత, ప్రే
మము లేశమ్మును దోప దట్టిపురుషమ్మన్యుండు విశ్వాసియే?

కావున మగవారల నమ్మరాదు. నీమార్గమున నీవు పొమ్ము.

చంద్ర—చెలీ! నీవుకాక నా కేమార్గమును లేదు.

సీ. సదనుగ్రహమునఁ బ్రసన్నవు కాగదే
రమణీలలామ యోరత్నమాల

రత్న— పై పూతకూర్మి నీపగిదిఁ జూపినయంత
సాగునా సఖ్యంబు చంద్రకాంత!

చంద్ర — నీవె సత్యముగ నాజీవయాత్రకు ప్రాణ
నాయకి యేలవే నళిననేత్ర!

రత్న— జారిణీకాంతల సఖ్యంబు దూష్యంబు
పని యేల నాచెల్మి ప్రాణనాథ!

చంద్ర— నీకృపావీక్షణపుకల్మి లేక యెటులు
జీవనము సేయువాఁడ రాజీవగంధి!

రత్న— ఓమనోహర! యతులమహోత్సవముగ
నేలుకోను మోయి వేగ నేతాళఁ బాల.

(ఇద్దరు కైదండలు పట్టుకొనెదరు)

చంద్ర ప్రేయసీ! పన్నెండు రోజుల ప్రాయము నుండియుఁ బెంచి పెద్దదానిగాఁ జేసి తుదకు నీశ్వరవరప్రసాదిగాఁ జేసిన నీకు నే నేమి యీయఁగలను? అందులకు ప్రతిగా నొకముద్దు పెట్టుకొనెదను
(అటులు చేయును)

రత్న - ప్రాణేశ్వరా! నా కదియే పదివేలు నావ్రతాంకురము నేఁటికిఁగదా ఫలించినది!

చంద్ర—ప్రియురాల! ఇక మన మీయరణ్యమున నుండ నేల? మాతండ్రిని తల్లిని జూచుటకు నామనం బుత్సహించుచున్నది పోవుదము

రత్న—నాధా! అటులె పోవుదము.

[అంతటఁ జంద్రచూడుఁడు మారువేషముతోఁ బ్రవేశించును]

చంద్రచూ — ఈయరణ్యములో నైతము జనులకలకలము విన వచ్చుచున్నది దొంగతనముఁ జేసినవానికిఁ బ్రతియంశమును భయకారణమై యయినటులు ఎక్కడ నేవ్వని విన బడినను సింహకేతుని భటులను భయము దోఁచుచున్నది

చ. సమరమునందు శాత్రవుల సాయక లేశము లెల్ల మేనిలో
నిమిషి ఖరేఖరే ల్మనుచు నెంతయు బాధ యొనర్పఁ దానిచే
నమితపుఁ గష్ట మొంది భయ మైనగవాటముమండి భూమికిన్
దుమికితిఁ బాఱిపోవుటకుఁ దోఁచఁ జరింపఁగ నెట్లు దైవమా!

(ముందుచూచి) అమ్మో! అక్కడ నెవ్వరో నడచుచున్నవారు. వారిరూపములు భయకారణములుగాఁ దోపకుండుటయేగాక అనురాగసూచకములుగాఁ బొడకట్టుచున్నవి.

చంద్ర — ప్రేయసీ! నాకు మిక్కిలి దాహ మగుచున్నది. తృష దీర్చికొనుమార్గము కానరాదు వేగ నడువుము ముందేదయిన జలాశయము కనిపించవచ్చును.

రత్న — ప్రాణేశ్వరా! మీరలసియున్నటులు నే నిదివఱకే తెలిసికొంటి, నీయరణ్యంబున నుదక మెటులు దొరకునో కదా!

చంద్ర — మనోహరీ! ఆక్రేవనుండి పక్షులు గూయుచు వచ్చుచున్నవి. ఆప్రాంతమున సరోవర ముండవలయును

చంద్రచూడు — ఓహో! యీయాననారంభుం డెవఁడో నాహృదయమును జూరగొనుచున్నవాఁడు వీనిలక్షణము లుపలక్షింప నాభార్య లక్షణములు కొన్ని వీనియందుఁ గానవచ్చుచున్నవి. అబ్బా! ఏమిది! నాకంతకంతకు బ్రేమ మధిక మగుచున్నది.

చంద్ర — (సమీపించి) అయ్యా! మీ రెవ్వరో విరాగులవలెఁ గన్పించుచున్నారు. మీనారికేళపుజలకుంభికలోని జలముఁ గొంచె మిచ్చి నాదాహశాంతిఁ జేయఁగలరా?

చంద్రచూ — ఆ! అటులే యిచ్చెదను (ఇచ్చును)

చంద్రకాం — (పుచ్చుకొని చాటునకేగి త్రాగి తిరిగి యిచ్చును.)

చంద్రచూ — (తనలో) అన్నా! నాపిల్లవాఁడు బ్రతికియుండిన నిప్పటి కింతవాఁ డగునుగదా! నావంటి నిర్భాగ్యున కట్టిపుత్రసంపద యెట్లు లభించును! యీబాలునిపై నిష్కారణ మేల యిట్టియవ్యాజకరుణ పుట్టవలెను?

గీ. కారణము లేక యితరులఁ గనినయంత
నే మది కఱఁగి నీరగునే కటకట!
చంద్రకాంతులకునుగాక చంద్రకాంత
మణులు కఱగునే రవిబింబమహిమఁ గనిన.

ఓయి! నిన్నుఁ జూడఁగనే మ ద్దగుచున్నది. ఒకసారి నాచెంతకు వచ్చెదవా?

చంద్రకాం—(సమీపించును.)

చంద్రచూ—(కౌఁగిలించుకొని) ఆహా! ఏమి యీపరిష్వంగ సౌఖ్యము!

చ. పలుచనిగంధలేపనము వారివిహార మొనర్చినట్టి యా
మలయపుచిన్నతెమ్మెరలు మల్లెలు గొజ్జగినీటితుంపురుల్
సలలితచంద్రకాంతిఘనసారముఁ జల్లని వంచు నెంతు రీ
యిల సుతు కౌఁగిలింతలకు నెంతయుఁ జాల దటంచు నెంచెదన్.

అదియుఁగాక

గీ. బాలకుని స్పర్శచేతనె లీల నాదు
మేను పులకిత మయ్యె సౌఖ్యానఁ దగిలి
పట్టి చూచిన గంట్రక ఫలముకీతిఁ
గానుపించెముఁ బరవశ మూనుచుంటి.

ఓయి! నీ వీవనంబునకు రా గత మేమి? ఆవచ్చుకాంత నీ కేమి కావల యును.

చంద్రకాం—అయ్యా! ఆమె నాప్రేయసి విధివశంబున వన ములం దిరుగుచున్నారము.

చంద్రచూ—వత్సా! ఆమె నీకంటె వయసున నధికురాలుగా కనుపట్టుచున్నదే.

చంద్రకాం—ఆ అదినిశ్చయమే అందుల కొక కారణము కలదు.

చంద్రచూ—(తనలో) అకటా! ఈమాటలు న న్నూరించు చున్నయవి యితఁడు నాపుత్త్రుఁడును ఆమె నాకోడలు అనునాస నన్ను బాధించుచున్నది. హా! ఈనిర్భాగ్యున కట్టిమహోత్సవము సంభవిం చునా? కాని కొన్నియంశములనుబట్టి యనుమానము కలుగుచున్నది. నాఁడు సింహకేతుఁడు నన్ను బంధీకృతునిఁ జేసెదఁ తరి రత్నమాల నీబా లునిఁ దోడ్కొని యడవుల కేగె నని నన్ను పాలంభించినాఁడు. ఒకవేళ

నాయదృష్టపురేఖ బయల్పడి వా రింతవారు కాఁగూడదా? అల్లదే! యామెయు వచ్చుచున్నది.

రత్న—రాజపుత్రా! నీ వాజోగిదరి కేల పోయితివి? రమ్మా! రమ్మా!

చంద్రకాం—అయ్యో! నన్ను విడువుఁడు.

చంద్రచూ — (విడచి) అక్కటా! ఈతనివియోగము నాకుమిగులఁ బరితాపకర మగుచున్నదే!

గీ. తమ్మిఁగొంచుఁ బోవఁ దార మేగినగతి
బాలకుండు నన్ను వదలిపోవు
చును మదీయచిత్తమును గొని చనె, నక్క
టకట! ఈవియోగ మనుభవింప

రత్న — ఓయి చెలికాఁడ! జోగులను నమ్మరాదు. అతనిచెంత కేల పోయితివి?

చంద్రకాం — వానికుండికజలమున దాహశాంతిఁ జేసికొంటిని. ఆతఁడును మిగుల గారవమున నే దేదియో సంభాషించుచుఁ దనలో నేదియో యనుకొనుచుఁ బరితపించుచున్నవాఁడు.

చంద్రచూ—అమ్మా! అతని దండింపకుము. నేను మాయ కాఁడను కాను. నే నతనిని జూడఁగనె యధికానురాగము గలుగుటం జేసి కొంచెమాపి వేడుకపడుచుంటిని. నాయందించుక దయయుంచి మీయిరువురివృత్తాంతమును జెప్పఁ గోరుచున్నాను.

రత్న— అయ్యో! మావనవాసక్లేశములకు మాకర్మమే కారణము. ఏమి చెప్పుదును.

చంద్రచూ — అటులు చెప్పుట సరికాదు. మిమ్ములఁ జూడఁగనే నా కధికానురాగము కలిగిన దాటచే మీవృత్తముల నరయఁగోరితి.

రత్న—అయ్యా! ఏకారణమును లేక మాసంగతిని మీ రేల కోరెదరు? ముందు మీయనుమానమును జెప్పుఁడు పిమ్మట నే జెప్పెదను.

చంద్రచూ—అమ్మా! మఱేమియు లేదు మున్ను సింహకేతుని పుత్రిక యగురత్నమాలఁ దనకుఁ బెండ్లి చేసినబాలునిఁ దోడ్కొని వనములకుఁ బోయె నని వినియుంటిని. కావున, వారే మీ రనుశంకచేత నడుగుచున్నాఁడను

రత్న—అయ్యా! దాచనేల? మీవంటివా రెఱుఁగని దెద్దియును లేదు. మీరు వచించిన నిర్భాగ్యురాలను నేనే.

చంద్రచూ—(తనలో) ఓహృదయమా! త్వరపడకుము. ఇఁక నీకోరిక సఫలమైనది. (ప్రకాశముగ) అమ్మా! పంద్రెండుకోజుల ప్రాయమునుండియు నీతనిం బెంచి పెద్దవానిఁగాఁ జేసిన నీసాధ్వీత్వమును నే నేమని పొగడుదును! అడవులలో నెన్నియిడుములఁ బడినావో కదా! అనుగ్రహించి యీతని నొకసారి కౌఁగిలించుకొననిమ్ము. (కండ్ల నీరు వెట్టుకొనును.)

రత్న—అయ్యా! ఈతనిఁ జూచి యింతవగ వట కేమి కారణము.

చంద్రచూ—అమ్మా! యీతనితండ్రి నాకు స్నేహితుఁడు కావున వారివంశపుమొలకను జూచి యానందపడుచున్నాను.

రత్న—వారిపుడు సుఖులై యున్నారా?

చంద్రచూ—ఆ, పేరునకుమాత్రము

రత్న—ఏమి? అటులు పల్కుచున్నవారు!

చంద్రచూ—నీ వరణ్యమునకుఁ బోయినవార్త విని యతఁడు తనమొదఁ జేసినమోసమునకుఁ గినిసి మీతండ్రి వానిని చెఱయుం దుని చెను.

రత్న—కటకటా! యిట్టియాపద వారికిఁ దటస్థించుననియే నే నెవరికిని దెలుపకుండ నడవులకు వచ్చితిని. పాపము వారు సంతానము కనినందులకు ఫలము కారాగారనివాసము కాఁబోలును. విధివశము దాట నెవరితరము?

చంద్రకాం—ఏమి! సింహకేతుఁడు మాతండ్రిని చెఱయందుని చెనా? విపక్షవనదవానలుండగు చంద్రకాంతుండు వచ్చునని యెఱుంగఁడు కాఁబోలును ప్రేయసీ! త్వరపడుము.

చంద్రచూ—నాయనా! నీధైర్యప్రతాపములు నాహృదయమును జూఱఁగొనుచున్నవి. (చేరదీసికొని) నాయనా! నీతండ్రి చెఱనుండి విముక్తుఁడయ్యెను సుమ!

చంద్రకా—ఏమీ? విడువబడెనా? ఇపుడెచ్చట నున్నవారో కదా!

చంద్రచూ—నాయనా! అట్టిజీవన్మృతుఁడను నేనే యొరులెఱుఁగకుండఁగ నీమాఱువేసముతోఁ జరించుచున్నవాఁడను.

రత్న—అయ్యో! అట్లైన నీపత్రిక నెవరు వ్రాసిరో చెప్పఁడు.

చంద్రచూ—అమ్మా! నేనే వ్రాసి నాఁడీబాలకుని మెడయందు కట్టితిని.

రత్న—రాజకుమార! మీతండ్రిగారికి నమస్కరింపుము.

ఇద్దరు—(నమస్కరింతురు.)

చంద్రచూ—(క్రిందుముఖుగ) దీర్ఘాయుష్మతీభవ! దీర్ఘాయుష్మాన్భవ (కుమారుని చేరఁదీసికొని) పుత్రగాత్రపరిష్వంగసుఖము నేఁడుకదా! నీప్రాపువలనఁ గంటిని ఓసాధ్వీమణీ!

గీ. కోలుపోయినవిధి నిచ్చిపాలనంబుఁ
జేసినట్టులు నీవు నాచిత్తమలరఁ

బుత్రుఁ దయచేసితివి నీదుపుణ్యచరిత
మును నుతింపఁగ దరమె శేషునకునైన.

రత్న—ఇది యంతయు మీపుణ్యవిశేషము.

చంద్ర—తండ్రిగారు మన మాసింహకేతుని జయించి మనరాజ్యమును మనము చేకొందము, రండు, పోవుదము.

చంద్రచూ—వత్సా! వానిపరాక్రమ మనతిక్రమ్యము. కావున, వానిఁ గెల్వఁ ద్వరపడ వలనుపడదు.

రత్న—అయ్యా! మీపుత్రునకు భగవంతుఁడు సాక్షాత్కరించి వరం బొసంగినవాఁడు రిపులవలన నిసుమంతయు భయములేదు రండు. పోవుదము ప్రథమమున సామోపాయము శ్రేష్ఠము.

చంద్రచూ—అన్నివిధములను నే నిఁక ధన్యుఁడనే. రండు పోవుదము.

(నిష్క్రమింతురు.)

శ్రీ

# చంద్రకాంత నాటకము.

## అష్టమాంకము.

రంగము—సింహకేతుని సభాభవనము.

[సింహకేతుఁడును మంత్రియుఁ బ్రవేశింతురు]

సింహ—.అమాత్యశేఖర! మన చెఱసాలనుండి తప్పించుకొని పోయిన చంద్రచూడునివార్త యిసుమంతయుఁ దెలియలేదుకదా!

మంత్రి—దేవా! మనము పంపినచారులలోఁ గొందఱింకను రాలేదు. వచ్చినవారు జాడ తెలియలేదని చెప్పినారు.

[సేవకుఁడు ప్రవేశించి]

సేవకు—దేవా! చంద్రచూడుండు డోకనిని బురస్కరించుకొని సమరమునకు వచ్చినవాఁడు.

సింహ—ఓరీ యుద్ధమునకే వచ్చెనా? తత్క్షణ మాదుష్టులఁ దోడ్కొనిరమ్ము.

సేవకు—చిత్తము (నిష్క్రమించును)

[అంతటఁ జంద్రచూడసింహకేతులు ప్రవేశింతురు.]

సింహ—ఓరోరి! రాజకులకళంక! ఓరి విగతలజ్జాప్రతాపక! చెఱలోనుండి పలాయనుఁడవై సిగ్గులేక నాపేరోలగమునకు వచ్చుటకు నీకెటులు మొగము సెల్లెనురా? ఇపు డేఁదుఁ బోయెదవు నిలువుము.

చంద్రచూ—ఓరీ! కాఱు లఱవకుము. ఈతఁడు నాకుమారుఁడు, చంద్రకాంతుఁడు నీపుత్రికయు సుఖంబున నున్నయది. కావున వైరము నెఱపక మారాజ్యమును మా కిమ్ము.

సింహ—ఓరీ! వారిసుఖమునకు సంతసించినను నీవు చేసినమోసమునకు నిన్ను విడుచువాఁడను కాను.

చంద్రకా—ఏమీ! నేను హితుఁడను, మాతండ్రి యహితుఁడునా వివేకవంతుఁడనై మమ్ములఁ గారవించుకొనుఁడు. లేకయున్న నీకె బాంధుత్వమునకు దూరమె.

చంద్రచూ—ఓయి! నీ వకృతాస్త్రుఁడవు. బాలుఁడవు. కావున నీవు దూరమున నుండుము

చంద్రకా—అనలకణము చిన్నదైనను తీక్ష్ణమునకుఁ బెద్దదియె సుమి!

సింహ—అటులైన నాయనలకణప్రభావమును జూపుము.

చంద్రకా—ఓ! అందుల కేమి కొదువ!

చ. ప్రళయభయంకరత్రినేత్రశిఖపర్వధరాతల మెల్ల కాల్చున
ట్టుబనిశితాశుగంబులఁ గడు గడు సాంద్రముగా గనేసి వ్యా
కుల మొనరింతు నీపురి నకుంఠితభీమపరాక్రమక్రియన్
బలిమియు బాలభావమును బాణ్రుచుల్ గను మోరి దుర్మతీ.

సింహ—ఓరి దంభప్రలాప! నీప్రతాపము నిన్నుఁ జూడగనే తెల్లమగుచున్నది

ఉ. బాలురతోడ నాకుకొను బంతులు కావుర శస్త్రజాల మా
భీలముగా మెయిన్ బొడిచి వెల్వడఁ జేయును రక్తధారలన్
జాలురనీప్రతాపములఁ జయ్యనఁ బోవిడి కేలు మోడ్పుమీ
ఏల వృథాగ జచ్చెద విదే నినుఁ బ్రోచెదఁ గూర్మి పెంపునన్.

చంద్రకాం—ఓరి దైత్యాన్వవాయభారభూత!

ఉ. తారక లెల్ల నొక్కమొగి ధర్మముఁ దప్పుచు దుళ్లిపోయినన్
నీరధు లేడు నిండినను నీరజమిత్రుఁడు నేఁడె బాసినన్

ధారుణి క్రిందుమీదయిన ధైర్యముదూలుచుఁ జంద్రకాంతుఁడా
తీరునఁ గేలు మోడ్చునె? వధించును గాని విపక్షసంతతిన్.

సింహ—ఓరీ!

గీ. పరులు బలియుం డనుచు మెచ్చవలయు నిన్నుఁ
గాని నీయంత నుతులకుఁ బూనఁ దగదు
దాంభికులపద్ధతులు కాని ధైర్యమతుల
మార్గములు కావు ప్రేలుటమాను మోరి.

చంద్రకాం—ఓరి! నిశాట అట్లుకాదు.

గీ. పొగడుకొనుటలు కాదుర మూర్ఖ యెపుడు
ధీరుల ప్రతాపగుణములు తెలియఁబడక
దొడరి దుఃఖాంబునిధిలోనఁ బడుదు రనుచు
దెలిపి బ్రతికి తు రగులను బలియు లెపుడు.

సింహ—అబ్బా! ఏమి నన్ను బ్రతికింపఁ దలంచితివిగా! నీపలుకులకుఁ గోపంబును నీప్రాయమునకుఁ గరుణయు వొడముచున్నది నీ తండ్రి చేసిన మోసమునకై సహింప నీవు తటస్థుండవై ప్రాణముల రక్షించుకొనుము.

చంద్రకాం - ఓరీ! అది దుర్జనుఁడవగు నీపద్ధతిరా! స్వపరబలంబు నెఱింగి నూరాజ్యమును మాకిమ్ము. లేనిచో సమవర్తిన కతిధి వయ్యెదవు.

సింహ—ఓహో! కరుణించినందులకా! ఇట్లు ప్రేలుచున్నాఁడవు.

గీ. అనల మాహార మగునని యతిముదమున
మంటలోఁ బడి మిడుతలు మ్రగ్గుకరణి
నల్పునిగ నెంచి నను బోరియంగఁ జూతు
ఘోర! మీతండ్రి యెఱుఁగు నాయంతరంబు,

చంద్రచూ—ఓరీ! నీ వధర్మయుద్ధమున నన్నుఁ బట్టుకొంటివి కాని ధర్మయుద్ధ మొనరించిన నీయంతర మప్పుడే యగపడును.

సింహ—ఓపశువా!

గీ॥ ఒకనికనులకుఁ జూపి మఱొక్కబాలు
నకును నాపుత్రికను పరిణయము సేయ
ధర్మమార్గమె, నిన్ను యుద్ధమ్ములోన
పరిభవింప నధర్మమె పాపచిత్త.

చంద్రకాం—ఓరి నిశాట! అది యంతయు సాంబునివరప్రభావ మని యెఱుంగుము అందువలన మాతండ్రిగారికి దోషంబు లేదు.

సింహ—ఏమీ! నన్నిటులు మోసముఁ జేయుమని శంకరుఁడు మీకు వర మిచ్చెనుగా! అటులైన నాసాంబుడు హారపూరణమునకై మీయిరువురి కపాలములనుగూడఁ దెమ్మని నాతోఁ జెప్పియున్నాఁడు.

చంద్రకాం—అటులైన గానిమ్ము.

ఉ॥ ముందుగ నీకపాలమును మోదముతోడను ద్రెంచి భర్గుఁ డా
నందముఁ జెందఁ గంధరఘనంబుగ వ్రేలుకరోటిమాలయం
దఁదముగాఁగ గ్రుచ్చెద రణావనిలో నిముషంబు నిల్వుమీ
కొందల మంది నీసుతులు గొల్లని యేడ్వగఁ నాథుఁ డీల్గఁగన్.

సింహ—ఓరి మూర్ఖ! ఏమని ప్రేలుచున్నాఁడవు?

శా॥ ఘోరంబైన మహాహవంపుచవి నీకున్ జూపినంగాని యీ
బీరంబుల్ విడువంగఁబోవు శరసంభేద్యంబు గావించి నీ
సారంబుల్ వెడలింతు ఖేచరులు చంచత్స్వాంతులై విచ్చి యిం
పారన్ గోత్రము లెల్ల నూగ ధర యల్లాడన్ భయావేశతన్.

చంద్రకాం—బాగుబాగు. అటులు చేయకుంటివేని నీవు సింహకేతుఁడవు కావు. శ్వానకేతుఁడవు సుమి!

చ. ప్రళయపయోధరంబులు నభంబున జృంభము లొచుఁ జీవులన్
ఫెళఫెళ ఫెళ్ళుఫెళ్లు మని భీషణవృత్తిని గర్జనధ్వనిన్
గళవళ మందఁ జేసి యుదకంబుల ముంచెడిరీతి శింజినీ
గళితర వప్రయుక్తశితకాండపరంపరచేత ముంచెదన్.

సింహ—ఓరీ దంభప్రలాప! నాసింహధ్వజమునకు నీవు ప్రతిపాయుఁడవు సుమి!

గీ. చాప మెత్తుటకై నను జాల వీవు
కాండసంధానవిధి యెట్లు కలుగు నీకు
బలుకువార లనేకులు కలరు భువిని
బలికి నంతయుఁ జేసెడువారు లేరు.

చంద్రికా—ఓరీ! లఘిష్ఠ! నీవలె వృథాబీరంబులు పలుకువాఁడను కాను. పలికినదెల్లఁ జేసి తీరెదను చూడుము.

మ. దిశల న్నిండినమంట లొప్పఁగను భ్రాంతిం జెంద సర్వామరుల్
కృశతన్ దాల్చియు నాగలోకనిలయుల్ వేమారు తీండ్రింప వే
ల శరంబుల్ జనియించునట్లు లయకాలంబో యనన్ దోఁచు బ్ర
హ్మశిరోనామకబాణకీలలను సంహారం బొనర్తున్ నినున్.

(సమంత్రకముగ నస్త్రమును బ్రయోగించును)

సింహ—ఆహా! ఏమి యీప్రభావము చూపులకుఁ జిన్నవాఁడై నను మహామంత్రములును అప్రతిహతాస్త్రములును ప్రయోగించుచున్నవాఁడే. ఆహా! తెలిసినది నాపుత్రిక కేవల మాదిశక్త్యవతారికదా! ఆమె భర్తమాత్ర మాదిపురుషుఁడు కాకుండునా! ఓచంద్రకాంతా! నీవు జగదుత్పత్తిస్థితిలయకారణుండై నశివావతారుఁడ వని నే నిప్పటికిఁ దెలిసికొంటిని నీయస్త్రము నుపసంహరించి లోకములను నన్ను నుద్ధరింపుము అల్లుఁడ వైనను మహాత్ముఁడ వౌటచే నమస్కరించుచున్నాను. రక్షింపుము రక్షింపుము.

చంద్రికా — సింహకేతుమహారాజ! దేవునివలన నీవు రక్షింపఁబడినావు. లెమ్ము. లెమ్ము (అస్త్రము నుపసంహరించును)

చంద్రచూ—ఆహా! యేమి నాయదృష్టము! కేవల పరమేశ్వరుఁడు నాకుఁ బుత్త్రిఁడై నందులకు నే నానందసాగరమున నోలలాడుచున్నాను. బావగారు! ఇంతవఱ కందఱ మదృష్టవంతులమే!

సింహ — ఓయిమంత్రీ! వేగ మనపురోహితుని రావింపుము నాయల్లునకు నుభయరాజ్యములకును బట్టాభిషేకము నెఱపుదము.

మంత్రి—అయ్యా! మీపుత్త్రిక రత్నమాలతో నాయన యిదే వచ్చుచున్నాఁడు.

[అంతట పురోహితుఁడును రత్నమాలయుఁ బ్రవేశింతురు.]

రత్న—తండ్రీ! నమస్కారము.

సింహ — అమ్మా! సుమంగళీభవ! తల్లీ! యడవుల నెన్నియిడుములఁ బడినావో కదా!

రత్న— అవి దైవికములు వానికై వగవఁ బనిలేదు.

పురోహి — అయ్యా! యీసమయము జాగున కోర్చునది కాదు. చంద్రకాంతరత్నమాల లీభద్రాసనము నధిష్ఠింతురుగాక! (అంతటఁ దెర లేవఁగా సింహాసనమునఁ గూర్చుందురు)

సింహ—(కిరీటమును చంద్రకాంతుని శిరమున నుంచును)

పురో—

ఉ. స్వస్తి, వసుంధరేశునకు, శాతవిలోకనయుగ్మమాత్రవి
ధ్వస్తవిపక్షలోకునకు, దాసకులావనుఁడై నవానికిన్
శస్తకుఁ, జంద్రకాంతునకు సాధ్వి యనం దగు రత్నమాలకున్
నిస్తులకాంతిపూర్ణులకు నిత్యము శంకరుఁ డిచ్చి యేలుతన్.

సింహా కే & చంద్రచూ—(పుష్పములను ముత్యములను అభి షేకింతురు.)

సింహ—ఆహా! నే నెంత ధన్యుఁడను! ఈమహదానందవశమున దేహమును మఱచుచున్నాఁడను. ఓచంద్రకాంత! యుభయరాజ్యము లకుఁ బట్టాభిషిక్తుఁడవైన నీ కింక యేమి కావలయును?

చంద్రకా—మీయందఱ కృపారసంబునను దనుపఁబడిన నా కెందును గొఱంత లేదు. అయిన నిట్లగుఁగాత!

భరతవాక్యము

శా. నానాసస్యవితానసంపదల నానందింతుగ్రాతన్ జనుల్
భూనాథాగ్రణు లెల్ల ధర్మమున నీభూమిన్ సదా యేలుతన్
వాన ల్పంటల కెల్ల నర్థ మగుతో వర్ష జూపు గాతన్ మహా
నూనం బైనకవిత్వకల్పనఁ బ్రవీణుల్ గావుత న్ సత్కవుల్.

(అందఱును నిష్క్రమింతురు.)

గద్యము. ఇది శ్రీకాశ్యపగోత్రోద్భవచక్రవర్తానిసంశసుధాబ్ధి
సుధాకర, నరసింహాభిధానతనూభవ నరసమాంబాగర్భ
శుక్తిముక్తాఫల శ్రీకోణకంచి వేంకటసుబ్బరాయ
గురుకరుణాలబ్ధసాహిత్యవిబుధవిధేయ మాణిక్య
శర్మప్రణీతం బైనచంద్రకాంతనాటకంబునం
దష్టమాంకము సర్వము
సంపూర్ణము.



## ఈనాటకమునందు వచ్చు పాత్రములు.

| పురుషులు. | అంకము. |
| --- | --- |
| సూత్రధారుఁడు. | 1 |
| నటి. | 1 |
| చంద్రచూడుఁడు. | 1, 2, 5, 7, 8. |
| బుద్ధిసాగరుఁడు. | 1, 3. |
| దూర్వాసులు. | 1 |
| సేవకుఁడు | 1 |
| శివుఁడు. | 2 |
| పార్వతి. | 2 |
| భృంగి. | 2 |
| సింహకేతుఁడు. | 3, 8 |
| మంత్రి. | 3 |
| బ్రాహ్మణుఁడు. | 4 |
| కపటచంద్రకాంతుఁడు. | 4 |
| రాక్షసుఁడు. | 5 |
| అశ్వినులు — దేవవైద్యులు. | 5 |
| చంద్రకాంతుఁడు. | 6, 7, 8 |
| వనబాలకులు. | 6 |
| పంతులు. | 6 |
| బడిపిల్లలు. | 3, 6 |
| కాంచీపురరాజకుమారుఁడు. | 6, 7 |
| కాంచీపురమంత్రికుమారుఁడు. | 6, 7 |
| సింహకేతుని సేవకుఁడు. | 7 |
| పురోహితుఁడు. | 8 |

### స్త్రీలు.

| | |
| --- | --- |
| రత్నమాల — కథానాయిక. | 4, 5, 6, 7, 8. |
| మురళిక — చెలికత్తె. | 4 |
| దేవి — చంద్రచూడుని భార్య. | 1 |